# రేడియోపైన మహత్తర క్షణాల కోసం ఎస్త్రెలా యొక్క శక్తివంతమైన రేడియో బ్యాటరీలు

ఎస్త్రెలా యొక్క శక్తివంత
మైన రేడియో బ్యాటరీలు.
మీ ప్రియమైన సంగీతం
అధిక-శక్తివంతమైన ఎస్త్రెలా
బ్యాటరీల వల్ల అతి శ్రావ్యం
గాను, సంపూర్ణ ధ్వనితోను
ప్రసారమౌతుంది. కాగితపు,
ప్లాస్టిక్ మరియు లోహపు జాకెట్లలో
అమర్చబడియున్న బ్యాటరీలలో
కావలసినవి ఎంచుకోండి. అవి
లీక్-ప్రూఫ్ మరియు చాలా ఎక్కువ
కాలం ఉపయోగపడతాయి. అతి
కాంతిగల వెలుగునకు, నమ్మకముగా
పనిచేయుటకు టార్చిలకు
కూడ సరియైన ఎన్నికైనవి.





**ఎస్త్రెలా బ్యాటరీస్**

**అధిక శక్తి అధిక ఉపయుక్తత**

ఎస్త్రెలా బ్యాటరీస్ లి
బాంబె-19.

లోపలి పేజీలో వేసిన ఆరిగ్నా యోవిత చిత్రాలు ఎంతో బాగా వుంది.

—సాయి వరప్రసాద్ (విజయవాడ)

## వ్యాసాలు

రామలక్ష్మిగారి 'ఎక్కడుంది సభ్యత' వాస్తవికతకు చాలా దగ్గరలో నున్నది. అసలు నేడు నాగరికతనే భయంకర ముసుగులోపడి, భారత సంస్కృతికి మారుపేర్లయిన సభ్యత, సంస్కారాన్ని విసర్జిస్తున్నారు. మరి యిలాంటి వార్నేమనాలి???

మిస్ కాద సరోజారాణి, మిస్ మాల, చంద్రం, ఆనంద, సుధ, వేణి, బాల (పాతపట్నం.)

* * *

7—4—72 పత్రికలో 'ఫలానా దేశంలో లోగులు' గురించి తెలిపినందులకు ధన్యవాదాలు.

పల్‌రెడ్డి వెంకట్‌రెడ్డి (మిర్యాలగూడెం)

## ఓం నమఃశివాయ

మవారు రెండుమూడు వారాలుగా 'ఓం నమశ్శివాయః' అనే సరస్వతీగిరిగారి కందపద్యముల మీద విమర్శకుల జోరు పెరిగింది.

మొదటివారుని భార్యగా, కవయిత్రిగా ఆమె వ్రాసిన (కంద) పద్యాలను విమర్శకు అనువైనవిగా ఎంచి, పాఠకులలోని విమర్శకులు 'క్రిటిసైజ్' చేయటానికి పూనుకున్నారు. ఆమె 'కందం' అనే పేరు పెట్టటం దోషం కావచ్చు—కాదనను. కానీ అది చాలా అల్పమైన—దోషంగా మేము పరిగణిస్తున్నాము. కారణం—భగవంతుని పూజించేటప్పుడు మనస్సులో మెదిలే భావనాతరంగాలకు ఒక రూపు నిచ్చి, వాటిని భగవంతుని సేవకే వినియోగించుతూ, పొరపాటువల్లనో, మరే ఉద్దేశ్యంతోనైనా కవయిత్రిగారు ఈ దోషం చేసి ఉంటారనుకుంటున్నాము.

'దాసుని తప్పు దణ్ణంతో సరి' అన్నట్లు ఆవిడ తన లోపాలను భగవంతునికి చూపించింది. యతి ప్రాసలతో కూడి ఉన్న 'కంద' పద్యంలోనే స్ఫురించదీ

## ఉత్తరాలు

అర్థం, ఒక్కొక్కసారి. ఉదాహరణకు, ఈ క్రింది పద్యం చూడవచ్చు.

నమ్మితి నమస్కరించితినన్న
నావాడనంచు వ్రాయుచుంటి పద్యములన్
నిన్నష్ట కవిత్రినందురన్న
నీదే నా హృదయవీణ మధురరాగం.

ఈ విషయాలన్నీ పత్రికవారు దృష్టిలో ఉంచుకున్నే తటస్థంగా ఉన్నప్పుడు, విమర్శకు తావు దొరికిందిక దాని విమర్శక మహాశయులందరు విరుచుకుపడటమేమీ బాగాలేదు! 'అఫ్‌కోర్స్' పత్రికలవారు కోరేవి పాఠకుల నుండి సున్నితమైన సద్విమర్శలే కావచ్చు! కానీ వ్యంగ్యంగా విమర్శించే వారి ఉత్తరాలను కూడా మీరు వేయడం మాకు ఆశ్చర్యాన్ని కల్గించింది. ఉదాహరణకు ఈవారం పత్రికలో వెలువడిన విజయవాడ, రాంచీ ఉత్తరాలు.

'మా అభిమాన పత్రిక' అని చెప్పుకోవటం మోహన్, రమణగార్లకు సిగ్గుచేటు అన్పించిందిట. వారు వ్రాసిన ఉత్తరంలోనే చిన్నతప్పు(కమిస్రామాట్) ఉంచుకుని ఎదుటివారిని విమర్శించటం బాగాలేదు. రాంచీనుంచి వచ్చిన ఉత్తరంలో 'పాఠకులంతరఫున మిమ్మల్ని అభినందిస్తున్నాను' అన్నారావిడ. దాన్ని వ్యతిరేకించే మా బోటి వారుండగా వారికెందుకో అంత శ్రమ, మాకర్థంకాలేదు.

ఏదిఏమైనా పత్రికవారీ సమయంలో తమ అమూల్యమైన, వాస్తవమైన అభిప్రాయాన్ని పాఠకులకు అందించగలరని ఆశిస్తున్నాము.

ఎమ్. వి. కమలాకరరావు, ఎమ్. కళ్యాణశేషు కుమార్, దిట్టకవిరామశేషుప్రసాద్ (విజయవాడ)

* * *

ఇప్పటికైనా మీరు 'ఓం నమః శివాయ'పై విమర్శనలను ప్రచురించే పాటి ధైర్యాన్ని పుంజుకున్నందుకు ధన్యవాదాలు.—ఉదయ్ (కాకినాడ)




# ఆంధ్రపత్రిక వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 28—4—72
శ్రీ పరీధావినామ సం॥ అధికవైశాఖమాస॥ బ॥ పూర్ణిమ
సంపుటము: 65 సంచిక, 36

స్థాపితము:
1908

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1
విడిప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31·20 |
| 6 మాసముల చందా | 15·60 |
| 3 మాసముల చందా | 7·80 |


## విషయానుక్రమణిక


భారత్ - పాక్ సమావేశానికి
సరిహద్దు ప్రాంతం
బెలూచిస్తాన్


మన సోషలిస్టులు దాన్ని రియాక్షనరీ అంటున్నారు
బ్రిటన్‌లో పన్నుల మినహాయింపు


ఉత్తర వియత్నాం యుద్ధం మీద భారత్ వైఖరి నచ్చలేదు
ఈ మధ్య భారత్ - పాక్ మధ్య యుద్ధంలో అమెరికా వైఖరి కంటేనా?


ఇందిరా పాలనకి వ్యతిరేకంగా సత్యాగ్రహంలో పాల్గొనే వాళ్ల పేర్లు ఇక్కడ ఇవ్వండి




# కొండను తవ్వి...

బలివాడ కాంతారావు

అతను కుంభకర్ణునిలా కనిపించకపోయినా రాత్రుళ్లు అచ్చు కుంభకర్ణునిలా నిద్దర పోతాడు. పడగెత్తిన నాగులాంటి లోతు ముఖమైనా నాగులాంటి పగలేదతనికి. తియ్యని పెరుగు, పండిన దానిమ్మపళ్లు అతనికి యిష్టం. కాకిలాంటి ఛాయయైనా తిండికి వెతుక్కు తిరిగే అవస్థలేదు. చెరుకు గడలా వున్నా, చేరి యెవరూ రుచి చూచి యెరగలేదు.

అతని అదృష్టమేంటోగానీ, బదిలీ మీద యెక్కడకు వెళ్ళినా, యిల్లు, పని మనిషి, చాకలి మంగలి—అంతా అనుకూల వాతావరణమే! పోనీ ఆఫీసులో బెడదా అంటే అదీలేదు. జీతం హెచ్చుయినా నిర్ణయాలు తీసుకోవలసిన అవసరం లేదు. తీరుబడివున్నప్పుడు, యే ఆటో పాటో, యే నవలైనా చదువుకోవటమో, పోనీ యెవరితోనైనా కులాసాగా కబుర్లు చెప్పుకోవటమో—ఏదీ చెయ్యడు. ఏ చింతాలేని పుల్లారావుకు నిద్దర పట్టక అతని భార్య అలివేలకు పట్టుతుందా?

అలివేలుకు అత్తమామల పోరులేదు. ఆడబిడ్డలున్నా వాళ్లపోరు అసలే లేదు. ఉంగరాలచేయి అయినా, కందిరీగ నడుము లేదు. ఒకనాడు కొండంత కొప్పుండేదట. ఈనాడు పెద్ద బన్ను బిగించి నల్లని కొండను మోస్తున్నా, తెల్లని పర్వతంలా కదల్తుంటుంది. అందుక్కాదు విచారం. ఇంట్లో నల్లులబాధ లేదు. గోడల్మీద బల్లులైనా తిరగవు. పందులాంటి సంతానం, ఒక్కొడుకూ ఒక్కకూతురే. వాళ్ల గొడవ అసలే లేదు. ఒకనాడు చిరున పీడి యెరగరు. పిల్లలు చదువుల్లో ఫస్టు... చెప్పినట్టు వింటారు. ఎప్పుడైనా ఒక కాకి అదే పనిగా వరండాలోనికి తొంగిచూచి అరచిన్నాడు ఆమెకి ఆ రాత్రి నిద్రపట్టదు. ఎక్కడచుట్టాలొచ్చేస్తారో అని. దాబా యెక్కి వెన్నెల్లో తనూ, మొగుడూ హాయిగా తిరుగుతుంటే—ఆ దగ్గర్లోనున్న పార్కు చుట్టూ వున్న చెట్ల సమూహంనించి వచ్చే తీతిగపిట్ట అరుస్తూ నెత్తిమీదనించి వెళిపోతే—ఆమెకు ఆ రాత్రి నిద్ర పట్టదు;

వరికేం రోగం వచ్చేస్తుందో ?

ఇలాంటి అదృష్టవంతులకు యెలాంటి వుపద్రవం ఒక్కసారి వచ్చిపడింది. చెప్పొకో లేనంత వుపద్రవం! మహాపట్నంలో కొత్త కాపురం సర్దుకున్నాక, అన్నీ సవ్యంగా జరిగిపోతున్నయ్ హాయిగా వున్నామనుకున్నాక —ఒక రాత్రి, అర్ధరాత్రి, కాళరాత్రి— ఏమాత్రం వూహించడానికి అవకాశం లేకండా, కబురూ కాకరకాయ లేకండా, హఠాత్తుగా ఒక చుట్టం వూడిపడ్డాడు. ఎంత దగ్గరి చుట్టం కాకపోతే అంత చొరవ చేసుకుంటాడు? చక్కని డబుల్ బెడ్ పైన తెల్లని మల్లెలాంటి దుప్పటి, మెత్తని దిండ్లూ — పైన కొత్త ఉషా ఫేను తిరుగుతుంటే, భార్యాభర్తలు నిద్రపోతుండగా, కాసింతైనా మొగ మాటంలేకండా సరాసరి పడక గదిలోనికే దూసుకపోతాడా? కొద్దిగానైనా అనుమానం ఉండఖ్ఖర్లేదూ? పోనీ చిన్నవాడా? పెద్ద మీసాలు, పైకొచ్చినదంతాలు, తీక్షణంగా చూచే కళ్ళూ, నల్లనివాడైనా రాజఠీవితో మెరసిపోతున్నాడు. అతడే రాజా, రాత్రి మీద వచ్చిన రేరాజుకాడు—మూషికరాజు.

గోడకూ క్రొ బీరువాకుమధ్య సందులో దాగుని బీరువాకు కన్నంచేస్తున్నాడు. ఎంత ధైర్యం? అందులో పట్టుభట్టలు, టెర్లిన్ పేంట్లూ, నైలెక్సుగౌనులూ, స్ట్రెచ్ పేంట్లూ, నగలూ నాణ్యాలూ, ఖరీదైన సంసారమంతా అందులోనే వుంది. ఈ గజ దొంగ వాటికే కన్నంవేద్దామనే. అందులో ఉల్లిపాయలులేవు. ఊరగాయలేదు. ఎండు చేపలు అసలేవుండవు, పోనీ సర్దాకైనా గుండ పిండిచెయ్యడానికి పాత పుస్తకాలు లేవు. వాడి ప్రతాపం చూపించే అహం కాక పోతే యింకేమిటిది? చీమ చిటుక్కు మంటే లేచిపోయే అలివేలు, ఎలుక అరు పుకే అదిరిపడే యిల్లాలు, రంపపుపళ్ళతో అంత గట్టి కర్రనేకోస్తుంటే ... ఆమెపై పడితే ఆ మెత్తని ఒంటిపై రక్తం వర దలైపారదూ? భయంతో యెగిరి దూది పరుపుమీదపడినా ఒళ్ళు చెక్కలైపోయింది. ఏం మగాడీయన? అబ్బబ్బ—ఏదీ అక్కు ర్లేదు. భూకంపంవచ్చినా కదలరు. భూమి కుంగినా హాయిగా నిద్రపోతారు ... 'లేస్తురండీ... లేవండీ... మీ పుణ్యం వుంటుంది ... లేవండీ?'

'ఊఁ'

'లేస్తారా లేదా? అమ్మో...' మహారాజు లేస్తేనా? దగ్గరలో నీళ్ళుంటే చెవుల్లో పోసేది. చెవులు పట్టుకలాగాలని సొంతి పిక్క తియ్యాలని అనుకున్నా అదేపనిగా అంత పని చేసినట్లు కుదిపేస్తోంది.

'ఏమిటే... నీసొద' అవులింతలు.

'టార్చి... లైటు.'

'ఆ బిలుమీద!'

'నా ఖర్మ' మళ్ళీ గుర్రేనా? అదేం నిద్దరబాబో? లేవండి... చచ్చిపోతున్నాను.'

'హాఁ'

'చచ్చానండి.'

ఒక్కసారి హమ్మయ్య అంటూ లేచి—

'ఏమైందే.'

'ఆ టార్చిలైటు వేగిరం తెండి... తెచ్చారా? వెలుగుతోందా? అయితే... ఆ బీరువాసందులో వెయ్యండి. వేసారా? చూడండి... ఏముందో ?'

''ఏమీలేదే''

'ఏమీలేదూ? సరిగ్గా చూడండి.'

'సరిగ్గా చూసాను. ధూళి దుమ్మూ వుంది—ఒక కాగితం ముక్కవుంది.

'కాగితం ముక్కవుందా?

'ఉందే.'

'అది న్యూస్‌పేపరు ముక్కేనా?'

'అలాగేవుంది.'

'అయితే కన్నంవేసిందండీ, దొంగ ముండ.'

'కన్నం యేమిటే? యెవరే?'

'నా పట్టుబట్టల క్రింద న్యూస్‌పేపరే పెట్టాను.'

'అయితే.'

'ఎన్నిసార్లు చెప్పాలండీ దొంగ దొంగని?'

'దొంగా? ఆడదొంగే?'

'ఆడో, మొగో?'

అంతవరకు సగంనిద్ర సగం తెలివితో వున్న పుల్లారావుకు యిప్పటికి సరిగా తెలివి వచ్చింది.

'మగాడా? సరిగ్గా చూసావా?'

గబగబ లైటువేసాడు. మంచంక్రింద చూసాడు. ఎక్కడాలేడు దొంగ.

'నివ్వు నిజంగా చూసావే?'

ఎలక్ట్రిక్ దీపం వెలుగులో యింకా అలివేలు పెద్దగా శ్వాసిరితీస్తేవుంది. ఛంచుమించు యేడుపు వచ్చేస్తోంది. పుల్లా రావు బీరువా తెరచాడు. బట్టలూ అన్నీ చెక్కుచెదరకుండా వున్నయ్.

'కలగన్నావే? బంగారంలాంటి నిద్దర పాడుచేశావు.'

'మీకేం మహరాజులు?'

'ఏడీ దొంగ?'

'ఎక్కడో దాగున్నాడండీ?'

'ఎలాగొస్తాడు? తలుపు లేసివడు కున్నాంగా.'

'కిటికీ.'

'గజాలు గజాల్లా నేవుంటే యెలా గొస్తాడే?'

'ఎలకండీ... ఎలక.'

'హమ్మయ్యా—చంపావే. ఈ యేడుపేదో మొదటే యేడవరాదూ? పోయింది పడుకో.'

'దీపం వుండనీయండి.'

'దీపంవుంటే నాకు నిద్దరపట్టదు' అంటూ ఆర్పేసి పడుకున్నాడు.

'మీకు పుణ్యం వుంటుంది. కాస్సేపు తెలివేస్సైనా వుండండీ.'

'ఎలక మళ్ళీ రాదులే. వచ్చినా నిన్ను కరవదులే.'

అలివేలు ఉత్తమయిల్లాలు కాబట్టి పూరు కుంది మాటల్ని కట్టేసినా మనసును కట్టలేకపోయింది. సద్దుమణిగినా నిద్దర పట్టడంలేదు. ఎన్నెన్నో జ్ఞాపకానికి వస్తు న్నయ్. అతగాడు అప్పుడే మళ్ళీ నిద్దర పోగలుగుతున్నాడు. అలివేలు చిన్నప్పుడు ప్రియా అగ్రహారంలో వున్నప్పుడు తన పినతల్లిని యెలక కరచింది. ఆ బాధ యిప్పుడు యీమెకళ్ళకు కట్టోంది. తనను యీ యెలక యెలానూ కరుస్తుంది తన పినతల్లిలా తనూ బాధపడాలి. ఆమెకు రాత్రుళ్ళు నిద్దరవుండేదికాదు. బాధతో గెంతేది. యేడ్చేది. ఊరువూరంతా తన పినతల్లిని చుట్టుముట్టేవారు. మనిషో అనుమానం, మనిషోవైద్యం... ఆమెదీ తన లాంటి బతుకే. కలిగిన బ్రతుకు. సర్వస్వంవున్న బ్రతుకు. చాదస్తపు మొగుడు. అతగాడికి చాదస్తం— ఇతగాడికి మొద్దునిద్దర. ఒకరినొకరు తీసిపోరు.

మళ్ళీ చప్పుడు. ఈసారి యిదివరక్కంటే యెక్కువ చప్పుడు. 'నా తుపాకులు పేలు స్తాను. మీదగ్గర తుపాకుల్లేవు. మీరేం చెయ్యగలరన్నట్లు' మళ్ళీ బీరువా కొరుకు తోంది. దానికేం వాసన యిష్టమో యీ

బీరువాని పట్టుకొంది. మొగుణ్ని లేపినా లాభంలేదు. యెలకంటే అతనికెంత నీరసమో? దొంగ మనిషైతేనేం జంతువైతేనేం? ఎలకైతేనేం చీమైతేనేం? దొంగ దొంగే. దొంగమీద కనికరం దేనికి? దొంగనెందుకొదిలెయ్యాలి? చేతకానివాళ్ళే దొంగలౌతుంటారు. మనిషి మంచితో ఆర్జించి బ్రతకాలి. చెడుతో ఆర్జించి బ్రతికేవాళ్ళంతా దొంగలే. చెడ్డవాళ్ళంతా ఎలకలు, నల్లులు, బల్లులు — రెక్కల కష్టంతో బ్రతుకుతున్న తనలాటి సంసారులపై నే పడ్తారు!

మొగుడి తలగడ క్రిందనున్న టార్చిలైటువేసి చూసింది. అమ్మో—ఎంతదో? ఎర్రా కళ్ళు నిలబెట్టి 'నీపని పట్టిస్తానుండు' అన్నట్టు చూస్తోంది. జ్యూలోని పులిని చూసిందేమో అలానే యీ యెలకని బోనులోపెట్టేస్తే.

'లేవండీ...మళ్ళీవచ్చింది,'

ఈసారి విసుగుతగ్గినా విసుక్కుంటూనే లేచాడు, ఎదీ ఎదీ? బీరువాసందు, బీరువాలోని అన్ని అరలు—గుడ్డలు బయటకుతీసి మరీ వెతికాడు. మంచంక్రింద పెట్టెల్ని కదలించాడు. ఉస్సు హుస్సన్నాడు. కర్ర లేకపోతే కోటు హేంగరుతీసి టిక్కు టక్కు చేశాడు. ఎక్కడ దాగుండిపోయిందో ...కనిపిస్తేనా?

'అంతా వూహ—పడుకో' కసిరాడు. విసుగ్గా దీపం ఆర్పేసాడు.

'టార్చిలైటు వెలుతుర్లో చూసానండీ.'

'ఆ కాగితంముక్కని చూసివుంటావ్.'

'ఎలకనే—పందికొక్కులావుందండీ.'

## కొండను తవ్వి...

'అంత పెద్దదైతే యెటుపోతుందే.'

'నాకింకా చెవుడు రాలేదండీ ... కుటు కుటుక్కుమని.'

'పోనీద్దూ ఎలక్కి భయపడమేమిటి?'

కాస్సేపు మౌనం. ఆయనమీద మెల్లగా చెయ్యివేస్తే గతుక్కుమన్నాడు.

'ఎలకకాదండీ? నేను..దీనిని బోనులో పెట్టాలి.'

'పెట్టే.'

'ఈ పెట్టిన బాధకు ప్రతీకారం తీర్చుకుంటాను.'

'సరే—రేపు బోనుకొందాంలే...పడుకో.'

అతను మళ్ళీ నిద్దరపోగలిగాడు. ఎంత అదృష్టవంతుడు. కలలుగనడు. కన్నా కలలు జ్ఞాపకం వుండవు. ఏదో పూర్వజన్మ సుకృతం కాకపోతే...తిండి సుఖం, నిద్దర సుఖం. తనకు రెండూలేవని విచారించింది అలివేలు. ఉన్నా తినలేదు. తిన్నా అరిగించుకోలేదు. అలవాటులేని తిండి మరి. డబ్బున్నా ఖర్చుపెట్టలేదు. స్వతంత్రం వున్నా వినియోగించుకోలేదు. అచ్చంగా తను తన పిన్నిలాంటిదే. పిన్ని పల్లెటూరిది అనుకుంటే-ఇంతో అంతో చదువుకుని తను పిన్నిలానే తయారయ్యింది. పిన్ని అన్నిటికీ గంగిరెద్దులా తలూపేది. తనకీ ఆ తత్వమే వచ్చింది. గొడబల్లేకుండా హాయిగా బ్రతుకుతుండేది. అలాంటిదానికే ఆనాడు యెలక కరవాలా? ఆ తలపులు రాగానే తనకే యెలక కరచినట్టు భయం. నిజంగా ఆ రాత్రే తనకు యెలక కరచి నట్టు...తన చుట్టూ పారుతున్న మాంసం యెండుచేపలు తింటున్నబెంగాలీ బ్రాహ్మళ్ళు; దిగువని యెవరితోనే లేచివచ్చి పెళ్లిచేసుకున్న ఆవిడ, ఇంకోవేపు కిలాకిలా నవ్వుతూ అందరిమీద పరోక్షంగా చాడీలు చెప్పి తప్పించుకున్న ఆవిడ...వీళ్ళందరూ ఆనాటి ప్రియా అగ్రహారవాసుల్లో నేవున్నారు. ఆనాడు అలివేలు ఆడుకుంటున్న పిల్లినే... తనకు తెలియకండానే చంపేరు: ఆ మాంసాన్నే యెలకకాటుకు ఔషధంగా పిన్నిచేత తినిపించారు. తను పిల్లికోసం యేడుస్తుంటే...తన పిన్ని దేనికో యేడుస్తుంటే...అనుమతిచ్చిన ఛాందసుడు మొగుడు పెళ్ళాంపై కేకలేసాడు. తన చిన్నాన్నలాంటి మనిషే యీాయనాను. ఎదుటి యింట్లో తిరుగుతున్న పిల్లి ఆ పిల్లి అచ్చంగా...ఆ తెలుపుపై అక్కడక్కడా గోధుమరంగు చారలపిల్లి— తన చిన్ననాటి పిల్లిలానేవుంది. దాన్నిపట్టేసి తనచేత ఆ మాంసం తినిపించేస్తే...

అలివేలు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎంతసేపు తెలివేసివున్నా మళ్ళీ ఆ చప్పుడు వినపడలేదు. అమూషికరాజు బీరువాపైనున్న సామానులలో దాగున్నవాడు—సద్దుమనిగాక యిక లాభంలేదనుకుని కామోసు మెల్లగా కిటికీ తలుపుమీదనుంచి బయటకుగెంతి—గోడకు అంటుకునివున్న గొట్టాంనించి కిందికి దిగిపోయాడు. అలివేలు వుదయంకోసం యెదురుచూసి మోగన్ను నిద్దరపోయింది. ఆ నిద్దరలో కలగందేమో — ఎలక చప్పుడువిందేమో రెండుసార్లు ఉలిక్కిపడి లేచింది. ఒకసారి

వారి రామ్









కేకవేసింది. ఐనా కూతురి కోక రగ్గాలి వారు మేల్కొనలేదు.

పుల్లారావు ఆఫీసుకు వెళ్ళాక, పిల్లలను బడిలో వదలివచ్చాక ఒంటరిగా కూర్చున్న అలివేలుకు యెన్నెన్నో వూహాలు. మొగుడు రాగానే బజారుకు ప్రయాణం అయ్యింది.



# కొండనుతవ్వి...

క్రదబోను. ఆ ఋనువజివ్వలు అంత గట్టిగాలేవు. ఆ యెలక ఆ జివ్వలను పళ్ళతో కొరికేస్తుందేమోనన్న అనుమానం. అంతకంటే మంచిది వాడిదగ్గరలేదు. ఎంత చెప్పాడు? రెండురూపాయలు. వాళ్ళవూర్లో రూపాయికైనా యెవరికీ అక్కర్లేదు. వాళ్ళ స్నేహితుడెవడో అర్ధరూపాయికి కొని యింకో వూరినుంచి తెచ్చినట్టు జ్ఞాపకం. బోను లోపాలన్నీ యేకరువు పెట్టి రూపాయిచేసుకో అంది అలివేలు.

'బేరం చెప్పిన షాపుకు పొమ్మన్నా'డు షాపువాడు.

'ఏంవూరిదీ? మహాపట్నం. పిండే మనుషులు. సంసారులనే పిండేస్తున్నారు!' ఇద్దరికీ కోపం వచ్చింది. ఇంకో షాపు వుండదా అని వెళిపోయారు. ఆ షాపువాడు రేపు వస్తాయన్నాడు. రేపటివరకు ఆగడమెలా? తిరిగి తిరిగి గతిలేక మళ్ళీ మొదటివాని దగ్గరకే వచ్చారు. నల్లని యమకింకరునిలా కనిపించాడు వాడు. రక్తాన్ని పీల్చే జలగ అనుకున్నారు. వాడు మరీ టెక్కు చూపిస్తున్నాడు. ఒక్క పైసా తక్కువలేదన్నాడు. ఇష్టమైతే కొనండి కష్టమైతే పొమ్మన్నాడు. మంచివాళ్ళను దోచే దొంగదగ్గిరే, దొంగనివట్టే ఆయుధం వుండాలా?

'ఛీఛీ యీ వూర్లో అంతా మోసమే నండీ...మన వూర్లో యింత అన్యాయం లేదు. వేగిరం బదిలీ చెయ్యించుకోండి.'

విలాగో బోనుతో యిల్లు చేరుకున్నారు. ఆరాత్రి ఉల్లిపాయిముక్క యెరగా పెట్టి... బోను యెక్కడపెట్టాలని తర్జన భర్జనలు చేసుకున్నాక, ఇక్కడకాదు అక్కడని అనుకున్నాక, దాని విషయంలో యిద్దరూ కాస్త విసవిసలాడుకున్నాక—బీరువా కాస్త ముందుకు జరిపి ఆ సందులో పెట్టారు. మొగుడు నిద్రపోతాడేమోనని నాలుగు మంచిమాటలాడి—బాగా అలంకరించుకుని ఏనాటిదో—విక్కడ దాచినదో కాస్త సెంటు రాసుకుని, కబుర్లలో పెట్టినా తొమ్మిది గంటలకే మహారాజాగారు గుర్రుతీస్తున్నాడు. మరచిపోయిన కాశీమజిలీకథో, చిలకచెప్పినకథో— చెప్పాలని నెమరువేసుకుంటున్న సమయంలో అతగాడు పరుపుపైపడ్డాడు. ఐనా ఆమె కథ మొదలు పెట్టేసింది. అతగాను నూంకొటూనే గుర్రులోనికి వచ్చేశాడు. 'వెధవ యెలక

యీ గుర్రుకైనా భయపడిరావటం మానో కూడదా? ఎలాయైతే యీ గుర్రు పరప్రసాదమని భావించేదాన్ని' అనుకుంది. ఐనా యెలక వచ్చింది. బాగా బలం వుంటాదని వచ్చిందేమో? చప్పుడు వచ్చింది గాని తగ్గలేదు. పయ్యారం వంగ బోస్తోంది. సింహంలా గర్జించింది. పెరుగుట విరుగుటకొరకే ..తనలాంటి తప్పులెరగని వాళ్ళపై దాడిచేస్తే దేముడు లేడూ? ఉల్లిపాయ. మాంచి ఘాటైనపాయ. అది కోస్తుంటే తన కళ్ళలోనింగి నీరుకారాయి. అది అందుకే గానే బోనులోపడుతుంది. ఎవరుపంపుతారు? పనిమనిషి. అదికాదంటే, ఈయన. అంత పెద్ద గుర్రు తీయగల మనిషి యింత చిన్న జంతువును చంపలేరా? ఈయన చంపుతారా? చంపితే మా పిల్లకేమైనా జబ్బులు రావచ్చు. ఎక్కడో వదలాలి. ఎవరు వదుల్తారు? ఇరుగుపొరుగుతో అంత సఖ్యతలేదు. వాళ్ళతో కలవడానికి మనసు పుట్టలేదు. పొరుగువాళ్ళు చేపలు మాంసం తిని జీవిస్తారు. క్రిందావిడ పోటీల మనిషి. ఆ చిక్కులు విడిపించుకోలేం. ఆ లేచివచ్చిన మనిషి—గుడ్లగూబకళ్ళది... అలాగే చూస్తుంది. పేరుమాత్రం సరళ—ఆమెలో యీ సరళతా కనిపించలేదు అలివేలుకు. అలా తనవేపు చూస్తుందేం? 'అతను సన్నంగా నేను లావుగా వున్నాననా? ఎవరి ఒళ్ళు వాళ్ళది, ఎవరి బ్రతుకు వాళ్ళది!'

'లేవండి—పుణ్యం వుంటుంది.'

లేవాడు పుల్లారావు 'పడిందా?' అని. లేదనగానే బలవంతాన తెలివేసి ప్పాడు. ఎంతకీ బోను చప్పుడు వినిపించకపోగనే విసిగి బోను రెండు మూడు చోట్లకు మార్చాడు. అయినా అది 'మీ పప్పులు ఉడకవు' అన్నట్టు పరిగెట్టారు. మిమ్మల్ని యేడిపిస్తానన్నట్టు చేస్తోంది... దాగుడుమూతలు ఆడిపించేస్తోంది. అతగాడు విసిగిపోయాడు. ఆమె కోపం పట్టలేకపోతోంది. పాపం—పెద్దవాళ్ళు ... పాపం కాదు దొంగల్ని ప్రత్యేకించాలి తప్పా? దోచే వాళ్ళను లేకుండా చేయటం మంచిదే. అప్పుడే లోకకళ్యాణం! అప్పుడే మంచివాళ్ళు హాయిగావుంటారు ఈ యెలకను పట్టాలి. పట్టి చంపాలి...!

అయితే ఆ రాత్రి ... తెలివేసి యెదురు చూసే క్షణాల్లో—ఎప్పుడూ అనుకోని గుసగుసలు, ఆవేదన అతిక్రమించిన గుండెలు, ఆవే

కొన్ని వెల్లువలా ప్రవహింపజేసాయి. ఎంత ఆనందం! ఏనాడూ యింత దగ్గరగా లేరు. ఏనాడూ యిన్ని కోరికలు ఒక్క కోరికై తీరలేదు. ఏనాడూ యిన్ని సమస్యలు ఒక్క సమస్యయై పరిష్కారానికి దగ్గరైనట్లు అనిపించలేదు...

తెల్లవారినా యెలక పడలేదు. మళ్ళీ ఆవేదన — ఆవేదన. పిల్లలని స్కూల్లో వదలి వస్తూంటే సరళ గుడ్లగూబ కళ్ళతో చూస్తూ మెట్ల దగ్గర దిగువ గుమ్మం దగ్గర నిల్చొని 'రాత్రి మీ యింట్లో యేమిటి గొడవ?' దీనికెలా తెలుసన్నట్లు

---

# కొండనుతవ్వి...

చూసింది అలివేలు.

'మీ క్రిందవాళ్ళకి నిద్దర లేదట.'

'ఏమి ?'

'పైన దబ్ దబ్ శబ్దం చేస్తుంటే... క్రిందవాళ్ళకెలా నిద్దర పడ్తుంది?'

'ఆ యెలకలాంటిదానివే నీవ్వుపాలిటి' అని ఆమె అన్నట్లు అనిపించింది అలివేలుకు.

'మేం యేం చేసాం ? ఎలక గదిలో దూరింది. తరమొద్దా ?'

అంతలో దిగువావిడ నవ్వుతూనే వచ్చి నల్లి కాటు వేసినట్లు 'ఒక రాత్రి కాదు— రెండు రాత్రులు...అంత భయమైతే ఒక బోను పెట్టకూడదూ ?'

'పెట్టాం. పడలేదు.'

'చిన్న యెలకా పెద్ద యెలకా ?'

'పెద్దది.'

'మా యింట్లో యెలకలు చిన్నవే. అయితే మా యింటి యెలక కాదు నిష్ఠూరం వెయ్యడానికి.'

'మీ యింట్లోనూ యెలకలున్నాయా?' అని అడిగింది సరళను.

'మనుషులతోపాటు అవి ?'

'చలికాలంలో యెలకలు లేనప్పుడు మాకేంటో లోటుగా వుంటుంది' అందుకుంది దిగువావిడ.

అలివేలుకు నవ్వాలో యేడవాలో తోచ లేదు.

'బోనులో యేం పెట్టారు ?' సరళ అడిగింది.

'ఉల్లి.'

'వాటికి కంపు యిష్టం.'

'కంపంటే.'

'ఒక చిన్న యెండు చేప యెరపెట్టండి. ఎన్నిసార్లయినా పడ్తుంది.'

'వదిలేస్తే మళ్ళీ వస్తుందా ?'

'హాఁ.'

'అదే యెలకని యెలా పోలుస్తారు మనుషులా ?'

'మావారు బోనులోపడ్డ ప్రతి యెలక మీద కాస్త పెయింట్ ఒంపుతారు.'

అలివేలు ఒక నిర్ధారణకు వచ్చింది. ఎలక పడితే చంపితీరాలి. లేకపోతే మళ్ళీ దాని పోరు తప్పదు. సరే కంపు యెక్కడ దొరుకుతుంది? ఎవరు ముట్టుకుంటారు ?

'మీ పొరుగు బెంగాలీ ఆవిడను అడగక్కూడదూ ?'

అలివేలు నిస్సహాయంగా చూసింది.

'ఆవిడే నాకిచ్చింది. మా యింట్లోనూ అయిపోయాయి. పోనీ మీకు అనుమానమైతే నేనే అడుగుతాను.'

సరళ పైకి వచ్చింది. అడిగింది. బోనులో పెట్టి జాగా కూడా యెంచి పెట్టింది. పొరుగువాళ్ళు సన్నంగా, నాజూగ్గా, ఒక విధమైన లాలిత్యంతో వున్నారు. తల్లీ యెదిగిన ముగ్గురు కూతుర్లూ.

'ఇంట్లో యెలకలు తిరగక వీధిలో తిరుగుతాయా ?' అంది బెంగాలీ ఆవిడ. ఇదేదో మామూలు విషయంగా వాళ్ళంతా తీసుకోవటం అలివేలుకు నచ్చలేదు. తన చిన్ని వృత్తాంతం, తన కష్టాలు అన్నీ వాళ్ళతో చెప్పేసుకుంది. వాళ్ళిచ్చిన సలహాలు విన్నాక, తన కష్టాలెవరో అర్థం చేసుకున్నారన్న తృప్తి వచ్చింది. సరళ ధర్మమా అంటూ యిక యెలక వచ్చినా పూచీలేదు.

ఆ రాత్రి యెలక బోనులో పడింది. హమ్మయ్యా! ఏదో పెద్ద పులిని చంపినట్లు ఒక్క యెగురు యెగిరింది అలివేలు.

'ఎన్ని తిప్పలు పెట్టింది. దీన్ని చంపించండి.'

'ఎవరు చంపుతారు ?'

'పనిమనిషి. తెల్లారనీయండి.'

తెల్లవారింది. పనిమనిషి వచ్చింది. దానికీ యెలక అంటే భయం. చంపడం మాట అలా వుంచి యెక్కడైనా వదలి మన్నా వదలనంది. అలివేలుకు ఉప్పెనలా కోపం ముంచుకొచ్చేసింది.

'ఎవరికోసం చంపుతావు ?' కసిరింది.

'మాటలు సరిగ్గా రానీయమ్మా.'

'నా మాట వినని పనిమనిషి నాకొద్దు.'

'నీలాంటి యిళ్ళు మాకు పది. లెక్క పెట్టి నా జీతం యిచ్చెయ్, ఇంకెవర్తైనా నీ యింట పని చేస్తుందో చూస్తాను.'

'ఏమిటీ లోటు చేసాను ?'

'జీతపురాళ్ళిచ్చావు. ఒకనాడు ఒక పాత గుడ్డిచ్చినావా? కడుపునిండా తిండెట్టినావా?'

'నువ్వు చేసిన పనికి అంత జీతం యిస్తుంటేనే—యింకా యేవేవో యిస్తాము!'

పనిమనిషి వెళిపోయింది. అదట్లా బోను కండనే వెళిపోయింది. ఇంత గొడవయ్యాక పుల్లారావు లేచాడు. అలివేలు అటుట్ల తోసుతోంది.

'ఏం పనిమనిషి రాలేదా ?',

'ఏ పనిమనిషి వద్దు. నేనే చేసుకుంటాను.'

'ఎలకని చంపనందా?'

'ఏమైనా అంటాది. డబ్బుతో బాగా—'

'జీతం హెచ్చడిగిందా ?'

'చీరలూ డ్రెస్సులూ...కడుపునిండా పరమాన్నంతో తిండి కావాలట. విశ్వాసం లేనిది. ఏం వూరండీ యిది? మన వూళ్ళో అంట్లు తోమడానికి యేనాడైనా యిరవై రూపాయ లిచ్చామండీ ? నేనేమన్నాను ? ఎలకను చంపమన్నానా ? నోటికొచ్చినట్లు కూసింది. నాకు చాతకాదనుకుంటుందేమో ? ఈ వేళనించి యే పనిమనిషీ వద్దు. ఇవాళైనా కాస్త నన్నుబడ్డానేమో?'

గిన్నెలు తోమటం అయ్యింది.

'వెళ్ళండి. దాన్ని యెక్కడో దూరంగా వదలండి.'

'ఎలకంటే...నాకు...'

'ఇంతకీ వదలనంటారా?'

'అబ్బాయిని వదిలేమందా?'

'పిల్లల్ని పెంచినట్లు తయారు చేసారు?'

'ఏమిటీ ప్రొద్దున్నే కస్సుబుస్సులు.'

'నేనేం అన్నాను? ఎలకను వదిలేమన్నానా? ఆ మాత్రం'

'చాతకాదంటావ్. అంతేనా? పట్టపగలు యెవరింటి యెదురగా వదిలితే యెవరూరుకుంటారు? వాళ్ళచేత తిట్లూ దెబ్బలూ కాయాలనా నీ వుద్దేశం?'

'అయితే చంపండి. ఇంట్లోనే.'

'నీకు మతిగానిపోయిందా అలివేలూ? ఏమిటీ మాటలు?'

ఇంతలో తలుపు దడదడమంది. సరళ.

'ఎలక పడిందా?'

'పడిందమ్మా పడింది. పడకపోయినా బాగున్ను.'

'ఏం?'

'దాన్నెవరు వదులుతారు?'

'తెండి నేనే వదలేస్తాను.'

ఆవిడ యేంచేస్తుందోనని అలివేలు చూస్తోవుంది. బోనుతో ఆమె గుమ్మం దగ్గర ఆగి మొగుడ్ని కాస్త పెయింటు తెమ్మంది. మొహతిమీద యింత యెర్రని పెయింటు పోసాడు పైకివచ్చిన తోకపై మరికొంత అంటించాడు. మెట్లమీద నిల్చున్న అలివేలువైపు ఆమె చూస్తూ.

'ఈసారి వస్తే చంపేస్తాం' అంది.

ఆ రాత్రి అతగాడు మామూలుగా నిద్రపోతున్నాడు. చిన్నచప్పుడు. తలుపులు గోళ్ళతో తాకుతున్న చప్పుడు చూసింది. కిటికీ తలుపులు వేసివున్నయ్. తనకంటె ధైర్యమైన మగడి ప్రతాపానికి నవ్వుకుంది. నిద్రపట్టలేదు. ఎలక రావపోవటం యేదో లోటుగావుంది. కిటికీ తలుపులు తీసింది. ఎదురుచూసింది. ఎక్కడో యేదో పడ్డట్టు చప్పుడు. ఎన్నెన్నో ఆలోచనలు.

సరళ గుడ్లగూబకళ్ళు—ఎన్నడూ ఆవిడతో పొత్తు కుదుర్చుకోవనుకుంది. ఆవిడలో... యెంత మంచి వుంది. తనకున్న ఆస్తి, నగలు, డబ్బు ఆమెకు లేవు. కానీ ఆమెకో వ్యక్తిత్వం వుంది. తనకు నచ్చిన వాణ్ని పెళ్ళిచేసుకుంది. ఆవిడ కెన్నికష్టాల ? కన్నతల్లీ తండ్రీ బంధువర్గం దూరమయ్యారు. అవస్థలు పెరిగినా అన్యాయం పెంచుకోలేదు. తనకో అన్నీ వున్నాయి. ఏ ఆలోచనా లేదు. ఒకరిపై ఒరిగేవుండాలి. పాకుదేరిన నీటితో నిండిన చెరువు తను. సరళ వరదవెల్లువతో వుప్పొంగి పోయే గోదావరి...

పండ్రెండుదాటినా యెలక రాలేదు. అలివేలుకు నిద్దరరాలేదు. తను చెడ్డవాళ్ళను కున్నవాళ్ళంతా గుర్తుకొస్తున్నారు. బోను అమ్మినవాడు. ఆ బోను బజారు ముఖం చూసేసరికి మూడుచేతులు మారింది. ఆ ముగ్గురి చేతులు నోటికివెళ్ళాలి. ఆముగ్గురి ఆర్జనలతో బ్రతికే కుటుంబాలు, చుట్టాలు పక్కాలు, రోగాలు రొంగాలు...ఎలక దొంగ కాదప్పుడు. అదో చుట్టంలా రావటం యెంత బాగుంది. మళ్ళీ యీ రాత్రి వచ్చివుంటే యెంత బాగున్ను? అతనితో యెన్నో చెప్ప

LIT QUIZ NO. 95

# Rs. 1,15,000

**MAIN**

1ST PRIZE Rs. 45,000

2ND PRIZE Rs. 10,000

UPTO 3 ERRORS Rs. 7000

**FREE**

BIG-MINI 1ST PRIZE Rs. 20,000

UPTO 2 ERRORS Rs. 7,000

MINIQUIZ Rs. 14,000 UPTO 1 ERROR

CHOICEQUIZ Rs. 10,000

DEFENCE FUND Rs. 2,000

1. జనులకోసం జనులు శాసించి పాలించ వలసియున్న యెడల వారు రాజనీతికంగా అంగీకరించబడి / శిక్షితులై యుండవలెను.
2. కోపం / తృష్ణ బుద్ధి కుశలతను విచ్ఛిన్న పరచే ఉపద్రవం.
3. సేనలు / ధనసంపద సోదర ప్రేమ మరియు దయాభావం వల్ల నిర్మింపబడవు.
4. ద్రవ్యలోపం కళాకారుని / లేఖకుని బాడుగ వానిగా మార్చవచ్చును. అటులేపుష్కలంద్రవ్యం బహుశా కొద్దిమంది జనులకు విరామజీవనం సుఖములతో సంతుష్టి పరచవచ్చును, వారు భోగ విలాసాల కోసం యత్నింతురు.
5. ప్రకృతి ఆకస్మిక యోగం మరియు నిశ్చయత / ఆవశ్యకత యొక్క వింతైన మిశ్రమం అనేది నిజం.
6. మనము స్వయంగా మనంతట మనలను ఎడతెగక వంచింపు / సృజించు చున్నాము.
7. జనులు అకృత్రిమ నిదర్శనంగా మామూలు అనుశాసనాల / అయిష్టముల ప్రదర్శనను అలంకరించని యెడల ప్రపంచం ఎక్కువ అత్యానంద జనక స్థలమై యుండేది.
8. ఇతిహాసం మానవజాతి జీవనం యొక్క రికార్డు మరియు ప్రతిపాదన మరియు నారీ ఉద్ధరణ / ఉద్భవము అందలి సర్వాధిక రోమాంచక అధ్యాయములలో నొకటి.
9. దురంధరులు / లేఖకులు ఉభయులున్ను విధికి వశులు మరియు నాయకులు.
10. తుది విశ్లేషణయందు ఆనందం వ్యక్తి గత విషయం మరియు జీవించే / ప్రేమించే సామర్థ్యంతో సన్నిహిత సంబంధం కలిగి యున్నది.
11. మనుష్యుని / ఔషధ గాథ అధికాంశలో సహజ ఉత్పాదనలకు ప్రత్యామ్నాయాల గాథయై యున్నది.
12. అధికాంశలో విశ్వమందలి రాష్ట్రాలు / పరంపరలు ప్రవాసనల మరియు మిశ్రమాల పరిణామక ఏకీకరణమై యున్నవి.
13. జీవితం సర్వదా ఎడబాపుల / సామాన్య చతోక్తుల మయమై యుండవలెనా?
14. జీవిత ప్రాణులు ఏమిచేయునో లేక చేయ జాలక పోవునో దానికి ఏజాతి సంబంధ / సామాజిక ప్రాముఖ్యతయూ లేదు అని వచింప వ్యర్థం.
15. ఎంతమంచిదైనా తార / ప్రారంభం దాదాపు కనిపించగానే నిగూఢాంధకారమున సమసి పోయే కాంతి వంతనక్షత్ర జ్యోతియై పోతుంది.
16. ఆస్తి / పని ఈరోజుల్లో ఎత్తుకొని అక్కడక్కడికి కొనిపోబడనేరదు, అది పోర్టబుల్ కాదు.

## 16 CLUES

(1) It's essential if the people are to rule for the people that they should be politically ACCEPTED / EDUCATED.

(2) ANGER / DESIRE is a nuisance which disturbs the faculties.

(3) ARMIES / FORTUNES are not built on brotherly love and charity.

(4) Just as the lack of money may turn an ARTIST/AUTHOR into a hack, so may plentiful money, for few men are content to subsist in ease; they strive for luxury.

(5) The fact is that Nature is a strange mixture of chance and CERTAINTY/NECESSITY.

(6) We are CHEATING/CREATING ourselves continually.

(7) The world would be a much happier place if people would not decorate the exhibition of petty DISCIPLINES / DISLIKES as an evidence of sincerity.

(8) History is the record and interpretation of the life of humanity, and the EMANCIPATION/EMERGENCE of woman forms one of its most thrilling chapters.

(9) LEADERS / WRITERS are both victims and heroes of fate.

(10) Happiness is in the last analysis, a personal matter and is closely linked with the ability to LIVE/LOVE.

(11) The story of MAN/MEDICINE is largely the story of substitutes for natural products.

(12) Most of the world's NATIONS/TRADITIONS are amalgams resulting from migrations and mixtures.

(13) Must life always be full of PARTINGS/PLATITUDES?

(14) It is idle to say that what living creatures do or fail to do has no RACIAL/SOCIAL importance.

(15) Many a good STAR / START has been a bright meteor that shot into obscurity almost as soon as seen.

(16) WEALTH/WORK cannot be picked up and moved about nowadays; it is not portable.

**గమనిక**: ఇవన్నియు కొటేషనులు. రచయిత వాడిన పదమే సరియైన సమాధానము. అఫిషియల్ సొల్యూషన్‌కి తేది 9—4—72 ఆనందబజార్ పత్రికలో చూడవలెను. బహుమతి —లిస్టు లిట్‌క్విజ్ సెక్షన్ అడ్వాన్సు తేది 14-5-72 ఫైనల్ 21-5-72 అఫిషల్ సొల్యూషన్ వెంటనే పొందుటకు మీ ఎంట్రీలతో 10 పైII ల పోస్టుకార్డు మీద మీ అడ్రసు వ్రాసి జతపర్చి పంపండి. లిట్‌క్విజ్ సెక్షన్ ఉచిత కాపీకి వ్రాయండి.

## కొండనుతవ్వి...

కునేదాన్ని. అవసరమైతే జగడమాడేదాన్ని; చలించేదాన్ని. చేతనైనది చేసేదాన్ని...ఈ మూషికరాజు...నాకు ఆలోచన లిచ్చాడు. విశ్వాసం చూపించాడు. అలాంటి యెలకను పనిమనిషి చంపేసివుంటే? పని మనిషి యెంత మంచిది. ఎలకను చంపలేదు. అదే చంపేసివుంటే యెంత బాధపడేదాన్ని...

ఎలక—మళ్ళీవస్తే యెంత బాగుణ్ను... మళ్ళీ మళ్ళీ వస్తే—ఏదో సంచలనంతో బంతిలా గెంతేదాన్ని. హాస్యపు బటానీలు నములుకుంటూ బ్రతుకుమీద భాష్యం చెప్పుకునేవాళ్ళం. కట్టిన రంగురంగు సమస్యా తోరణాలు సరిగ్గా చూసి అర్థం చేసుకోడానికి మధ్యలో దీపాల తోరణం వెలిగించుకునేవాళ్ళం...ఎలక మళ్ళరాదేమో?

తెలతెలవారింది. అలివేలుకు మామూలుగా తెలివివచ్చేసింది. బట్టలు మార్చుకుని వంట యింటి తలుపు తీసింది. ఎదరగా... నేలపై...చిమ్మ దిగువగా ... నల్లగావడి వుంది. మూతిమీద తోకమీద యెరుపు రంగు. ఏవో దెబ్బలు...ఏ పిల్లి తరిమిందో ...ఏ రాయిపడిందో...అదే యెలక...ఈడ్చుకుంటూ స్వంతయింటికి వచ్చినట్లు...చచ్చి పడివుంది. అప్పటికే చీమలు మూగివున్నయ్. ఎవరో ఆత్మీయులు చచ్చినట్లు అలివేలు కెవ్వున కేకవేసింది. ●

## లిట్‌క్విజ్ నెం. 95 అధికార ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి: రు. **1,15,000/—** ఆఖరు ముగింపు తేదీ **3—5—72** బుధవారం

ADDRESS: LITQUIZ No. 95, ALANKAR, BALARAM STREET, BOMBAY-7.

గమనిక:—1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. 3. ఎంట్రీ రుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M. O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. 4. I.P.O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 95, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| MAIN | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 | Re. 1 | FREE |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED | |
| 2 | ANGER | DESIRE | ANGER | DESIRE | ANGER | DESIRE | ANGER | DESIRE | |
| 3 | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES | |
| 4 | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR | |
| 5 | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY | |
| 6 | CHEATING | CREATING | CHEATING | CREATING | CHEATING | CREATING | CHEATING | CREATING | |
| 7 | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES | |
| 8 | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE | |
| 9 | LEADERS | WRITERS | LEADERS | WRITERS | LEADERS | WRITERS | LEADERS | WRITERS | |
| 10 | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE | |
| 11 | MAN | MEDICINE | MAN | MEDICINE | MAN | MEDICINE | MAN | MEDICINE | |
| 12 | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS | |
| 13 | PARTINGS | PLATITUDES | PARTINGS | PLATITUDES | PARTINGS | PLATITUDES | PARTINGS | PLATITUDES | |
| 14 | RACIAL | SOCIAL | RACIAL | SOCIAL | RACIAL | SOCIAL | RACIAL | SOCIAL | |
| 15 | STAR | START | STAR | START | STAR | START | STAR | START | |
| 16 | WEALTH | WORK | WEALTH | WORK | WEALTH | WORK | WEALTH | WORK | |

## BIG-MINI

*ONE COUPON FREE WITH EACH MAIN COUPON*

| | FREE | 1 | FREE | 2 | FREE | 3 | FREE | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED | ACCEPTED | EDUCATED |
| 2 | ANGER | DESIRE | ANGER | DESIRE | ANGER | DESIRE | ANGER | DESIRE |
| 3 | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES | ARMIES | FORTUNES |
| 4 | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR | ARTIST | AUTHOR |
| 5 | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY | CERTAINTY | NECESSITY |
| 6 | CHEATING | CREATING | CHEATING | CREATING | CHEATING | CREATING | CHEATING | CREATING |
| 7 | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES | DISCIPLINES | DISLIKES |
| 8 | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE | EMANCIPA- | EMERGENCE |
| 9 | LEADERS | WRITERS | LEADERS | WRITERS | LEADERS | WRITERS | LEADERS | WRITERS |
| 10 | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE |
| 11 | MAN | MEDICINE | MAN | MEDICINE | MAN | MEDICINE | MAN | MEDICINE |
| 12 | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS | NATIONS | TRADITIONS |

*BOTH FREE AFTER 4 MAIN (& 4 BIG-MINI) COUPONS*

## MINIQUIZ

| | | | |
|---|---|---|---|
| ACCEPTED | EDUCATED | PARTINGS | PLATITUDES |
| ANGER | DESIRE | RACIAL | SOCIAL |
| ARMIES | FORTUNES | STAR | START |
| ARTIST | AUTHOR | WEALTH | WORK |

95

## ChoiceQuiz

Pick any 4 clues you feel you have correctly solved in your 4th coupon and indicate them in the adjacent corresponding blank spaces with 'yes' tick-marke (✓). If all your 4 choices prove correct you share the Choicequiz prize of Rs. 10,000.

ఈ క్విజ్ ప్రవేశమునకు గౌరవ నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీ ఫారము ఫీజు రు. 4/— M. O. రసీదు / I.P.O. / లిట్‌క్విజ్ క్యాష్ రసీదు ప్రైజు వార్డు జతపరుస్తున్నాను. పాటి నెం. ......

నెం. 95 ఫారమును పంపుటకై దీనిని పూర్తి చేయండి.

FULL NAME..............................................

..............................................

ADDRESS..............................................

..............................................

..............................................

POST.......................DIST.......................

95 (ASVP)

ఇంగ్లీషులో పెద్ద అక్షరాలలో వ్రాయండి.

FULL NAME..............................................

..............................................

ADDRESS..............................................

..............................................

..............................................

POST.......................DIST.......................

— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను —

**కె. ఎస్, రాయగడ**

తాము గొప్ప విమర్శకులమని చెప్పుకొనే పత్రికలు కొన్ని డైరెక్టుగాకాక, ఇన్‌డయిరెక్టుగా మిమ్మల్ని విమర్శిస్తే మీరు దానికి ఏమనుకుంటారు?

డైరెక్టుగా విమర్శిస్తే మన తప్పులుంటే వెతుక్కోవచ్చు. ఇన్‌డయిరెక్టుగా విమర్శించడంలోనే తెలుస్తోంది కదా వారి పిరికితనం. ఇంక వాటిని గురించి ఏమేనా అనుకోవడం కూడ దండుగ.

**జనార్దన్, తిరుపతి**

ప్రేమకి మీరిచ్చే నిర్వచనం?

అనిర్వచనీయమైన యిష్టాన్ని మాటలోగాని మాటల్లోగాని చెప్పడం సాధ్యం కాదు.

**ఎస్. ఎస్. ఆర్, విశాఖపట్నం**

మనిషి మరణం గురించి ఆలోచించడు ఎందుచేత?

వచ్చినప్పుడు దాన్నుంచి ఎలాగా తప్పించుకోలేనని తెలిసిన మానవుడు — మరణం గురించి ఎందుకు ఆలోచిస్తూ కూర్చోడం?

**ఆర్. బి. ఆర్, అయిజ**

మానవ హృదయంలోని సుకుమార భావనలకు గారుణ్యమునకు ధార్మికతకు పరమేశ్వర భక్తికి నాధ్యాత్మిక వికాసానికి దోహదం యిచ్చే సుదత్తమైన దారిలో నడచు సాహిత్యమునే చదువవలయునని భారతీయ సిద్ధాంతము.

అయితే రాబోయే కాలం పుస్తకాలకోసం వేచియుండవలసిందే!

**ఎస్. పి. ఎమ్. ఆర్, రాజమండ్రి**

ప్రేమనగర్ సినిమాలావుంది నా జీవితం. మమత నింపమన్నాను. మనసు చంపుకున్నాను దాకా వచ్చింది. ఈ ఘట్టం తరువాత ఏం వస్తుందో?

సినిమా చూడలేదు. కనీసం ఆ పాటేనా వినలేదింకా. లేకుంటే టక్కున చెప్పేదాన్ని! పోనీ మళ్లీ వోసారి చూడకూడదూ తొందరెందుకు?

**టి. వి, బాపట్ల**

కొంతమంది అబద్ధాలని తొణక్కుండా చెప్పేస్తారు అంతరూ అలా చెప్పలేరెందువల్ల?

ప్రయత్న లోపం కాదు. ప్రాక్టీసు తక్కువచేత!

**ఇ. సి. ఎస్. ఆర్, గుంతకల్**

మీరు తుగ్లక్ చిత్రం చూశారా? దానిపై మీ అభిప్రాయం?

ఏ భాషలో? అరవం— నాటకం వచ్చింది. సినిమా వచ్చింది. దాన్నే తెలుగులో నాటకంగా ఆడాలని కూడా చూస్తున్నారు. ఇక తెలుగులో సినిమా వచ్చేసిందీ— ఇంకా దానిపై అభిప్రాయం ఎందుకు?

**జి వి. ఎమ్, కాకినాడ**

మన విజ్ఞానం పెంపొందాలంటే?

మనకు నచ్చని విషయాలు సహితం అర్థం చేసుకోవడంలోనే— మన విజ్ఞానం పెరుగుతుంది.

**కె. ఆర్; కె. ఎస్; కె. జె; కె. ఏ, కాజూరు**

దుర్మార్గుల హృదయాలు బొగ్గుల్లాంటివి. వాటిని నీటితో కడిగినా పాలతో కడిగినా వాటిరంగు పోతుందా?

బొగ్గు అయితే అందుకు— నిప్పే దారి. కరుణ అనే నిప్పు పుడితే బొగ్గులాంటి దుర్మార్గహృదయం ప్రక్షాళితం అవుతుంది.

బంధాలను, ఆదరణ ఆప్యాయాలను తెంచుకుని దూరంగా పోవడం సాధ్యం అంటారా?

కాదు. శరీరం దూరం అయినా మనస్సుకి ఆ నిర్లిప్తత అవరించడం మానవులకు సాధ్యం కాదు.




**పి. జె. ఎస్, మద్రాసు**

ఉన్నదాంట్లో ఆనందంగా ఉండాలని ప్రయత్నించడం— తప్పా?

కాదు. అసలు ప్రపంచంలో ఉన్న ఆనందమే పరిమితం. ఆ ఉన్న కొంచెం ఎప్పుడూ మంచిదే కాని నిరుత్సాహం, విషాదం అన్నవి— ఎప్పుడూ చెడే. వాటిని దూరంగా వుంచాలనే తాపత్రయ పడాలి.

**కె. కె. ఆర్, అమలాపురం**

మీరెప్పుడూ అందరి ఉద్దేశ్యాలనీ వ్యతిరేకిస్తారెందుకు?

చూడండి కామేశ్వరరావుగారు. 'ఎవరి ఉద్దేశ్యం వాళ్లకి ఉండవలసిందే. అది నా ఉద్దేశ్యంతో ఏకీభవించాలి. అంతే' అంటారు పెద్దలు, మరి మనం వారి అడుగుజాడ అనుసరించే వాళ్లమే కదా!

**బి. హెచ్. ఎస్, ఖర్గపూరు**

డబ్బు వచ్చిందంటే చాలు. మనిషికి కళ్లు కనబడవు....

నిజమే. కాని మానవ పరిస్థితులు ఎప్పుడూ శాశ్వతాలు కావన్న సత్యం గ్రహిస్తే అదృష్టంలో విర్రవీగడం, దురదృష్టానికి కృంగిపోవడం జరుగదు.

**బి. ఎమ్. కె. ఆర్మూరు**

మనసు—మాంగల్యం. ఈ రెండింటిలో స్త్రీకి ముఖ్యంగా కావలసిన దేది?

రెండూను. సంఘంకోసం మాంగల్యం, తన కోసం మనస్సు.

**ఆర్. ఎస్, హైదరాబాదు**

సినిమాల్లో సెక్సును సెన్సార్ వారు కత్తిరించినా యింకా వుంటూనే ఉంది కదండీ. వాళ్లు ఏం కత్తిరించినట్లు?

సినిమాల్లో సెక్సు ఉండకూడదు. క్రౌర్యం వుండకూడదు. పొలిటిక్స్ వుండకూడదు. మత బోధన, మొదలైనవి వుండకూడదు. ఇంకేమిటి వుండాలి? వాస్తవికం బోర్, ఆర్టిఫిషియల్ బోర్ కామన్‌ప్లేస్ బోర్. మరింకేం కావాలి మీకు? సెక్సు చిత్రాలని పైకి తిడుతూనే ఆర్థికంగా ప్రోత్సహించే మీలాంటి ప్రేక్షకులు తిట్టుకుంటూనేనా మంచి చిత్రాలని ఎందుకు విజయవంతం చేయరు? చలన చిత్ర నిర్మాణం ఒక కళారాధన కాదు. వ్యాపారం. పెట్టుబడి డబ్బులు నాల్గు రావాలంటే— ప్రేక్షకులు పోషించే సరుకు నిర్మాతలు సప్లయి చేయక తప్పదు. తాగడం తప్పని తెలియకనా ప్రొహిబిషన్ ఎత్తేస్తే?!

**ఎం, కె. హెచ్, పర[illegible]ల**

దేవునిపైనున్న విశ్వాసం తక్కువ అగుటకు గల కారణం?

పరిస్థితులు అనుకూలించక పోవడం.




'ఏమండీ' సుగుణ హాల్లోకొచ్చి పిలిచింది.

ఈ పిలుపు శేఖర్ చెవులకి యింకా అంద లేదు. అది మొదటిసారి పిలిచిన పిలుపు అయితే వినిపించలేదేమో పాపం, పేపరు చదవడంలో దీక్షగా వున్నాడు అనుకో వచ్చును. కాని, అది మూడోసారి పిలిచిన పిలుపు.

'ఏమండోయ్, మిమ్మల్నేనండీ — ఎన్ని సార్లు పిలవాలి' ఈసారి కొంచెం గట్టిగానే పిలిచింది (అరిచింది) సుగుణ.

'ఇదుగో వచ్చేస్తున్నా...ఒక్క నిమిషం' అంటూ శేఖర్ పేపరు చదువుతూనే కుర్చీ లోంచి లేచాడు.

'వస్తారట ఎక్కడికొస్తారో! కళ్ళెదుట చెట్టంత మనిషిని నిల్చున్నాను — కనిపిం చటంలేదూ' అతని సమాధానానికి మండి పడుతూ అంది సుగుణ.

ఆమె మాటల్లో వేడి కొంచెం తగిలి శేఖర్ తల ఎత్తాడు. 'ఇక్కడే వున్నావా ? వంటింట్లోంచి అరుస్తున్నా వనుకున్నా' అంటూ తాపీగా కుర్చీలో కూర్చుని పేపరు వైపు దృష్టి మరల్చాడు.

తను ఎందుకు పిలిచిందో తెలుసుకుందా మనన్నా లేకుండా పేపరు చూస్తున్న భర్తని ఏం అనాలో తెలియక అయోమయంగా చూస్తూ నిలబడింది కాస్సేపు. అతని నిదానానికి తన నిదానంకూడ తోడయితే పన్లు తెమలవు అని తన కోపాన్ని అణుచు కుండి.

'పేపరు తర్వాత చూసుకోవచ్చు. వీణ్ని కాస్త ఆడించడమో, వీధిలోకి తీసుకెళ్ళ డమో చేస్తే నా పన్లు తొందరగా తెము ల్తాయి.' అంది బాబుని కిందకి దింపుతూ.

సుగుణ మాటలు తను విన్నాడు అన్నట్లు తల వూపాడు శేఖర్. కానీ పేపరు చూస్తూనే వున్నాడు.

'తల వూపడం చాలుగాని విణ్ణి తియ్యండి ముందు.' అంది వచ్చే కోపాన్ని అదిమి పెడుతూ.

'ఎవణ్ణి ?' పేపర్లో లీనమైన శేఖర్ అడిగిన ప్రశ్న.

సుగుణ విసురుగా సమాధానం యిచ్చింది. 'మీ సుపుత్రుణ్ణి.'

సుగుణ కంఠంలోని మార్పు అతణ్ణి

తల ఎత్తేటట్లు చేసింది. సుగుణని చూస్తూనే పేపరు పక్కకి పెట్టేశాడు. తన కాళ్ళ దగ్గర కొచ్చిన కొడుకుని చేతు ల్లోకి తీసుకున్నాడు.

ఆ రోజేదో విశేషం వుంది అనుకున్నాడు సుగుణని చూస్తూనే. సుగుణ తలంటుకున్న జుట్టు జారుముడి వేసుకుంది. ముఖము, కాళ్ళు పసుపు రాసుకున్నట్లు కనిపిస్తు న్నాయి. పట్టు చీర కట్టుకుంది. ముఖం మాత్రం ధుమ ధుమ లాడుతూ వుంది.

శేఖర్ నెమ్మదిగా గొంతు సవరించాడు. 'దేవీ! నీ పతిదేవుండు నటియింపబోవు నాటకంబునకు ఏ అవరోధంబులు వాటిల్ల కుండునటుల పూజలు సలిపి, విజయ వంతంబు సేయ మిక్కిలి ఆరాటపడుచున్న నిన్ను చూడ, అపరిమితానంద కందళిత హృదయారవిందుండనగుచున్నాడను' అంటూ వినమ్రంగా తల వంచాడు.

సుగుణ సహనం కోల్పోయింది. ఆమె కోపం తారాపథానికి అంటింది. 'నేను యింత వరకు వాగినదేదీ మీ చెవిలోకి దూరలేదన్న మాట' అంది.

'సాకల్యంగా వివరించు సుదతీ. సావ ధానంగా అవధరిస్తాం' అన్నాడు.

సుగుణ విసుగ్గా తల బాదుకుంది. అఘోరించినట్టుంది. పొద్దున్నే మొద లెట్టారేమిటి ఈ భాగోతం భాష. మీకు పుణ్యం వుంటుంది—వీణ్ణి కాస్సేపు అవత లకి తీసుకెళ్ళండి. ఇవాళ రథసప్తమి— పాలు పొంగించుకోవాలి. వీడు కాళ్ళకి చేతు లకి అడ్డాలు పడుతుంటే పన్లు సాగవ్' అంది చికాకుపడుతూ.

శేఖర్ కూర్చున్నవాడల్లా వెంటనే లేచి నిలబడ్డాడు. 'ఇంతిరో, వలనుపడదు. మేము కత్తి పదును పట్టించి వుంచాం— ఇన్నిసార్లు నరికినా తలలెత్తే ముష్కరాధ ములను హతమార్చవలసి వున్నది' అన్నాడు ఆవేశపూరితంగా.

శేఖర్ అలా అనేసరికి హడలిపోయింది సుగుణ. 'ఎవరి మీదకండీ యింత వుద యమే దండయాత్ర' భయపడుతూ అడిగింది.

'ఎంత సుగ్రాహ్యమయిన విషయమయినా నీకు అగ్రాహ్యమే — ఏమి చేయుదు—నా పూర్వజన్మ సుకృతమున లభియిస్తివి!' అంటూ పెదవి విరిచాడు.

# ఫలించని పథకం

ఘోర కార్యం తలబెట్టినవాడయితే తనతో యింత తీరుబడిగా వాదిస్తాడా? రోజూ నాటకం రిహార్సలుకి వెళ్ళివస్తూ ఉండడంచేత అబ్బిన జబ్బేమో యిది అను కుని మనసుని స్థిమితపరచుకుంది.

'అది సుగ్రాహ్యమయిన విషయమో, అగ్రాహ్యమయిన విషయమో నా బొంద నాకేం తెలుస్తుంది! అదేదో త్వరగా చెప్పి...'

సుగుణ మాట పూర్తి కాకుండానే శేఖర్ అందుకున్నాడు. 'చెప్పి ఏడవండి అనకుమా' అన్నాడు.

'అదేదో నోట్లోంచి తొందరగా వూడి పడితే నేను వంటింట్లో పడతాను. అహో ...తొందరేం లేదు— హోటల్నుండి కేరేజి తెచ్చుకు తిందాం అంటారా—మీ సోది విన డానికి నా అభ్యంతరం ఏమీ లేదు,' అంటూ అక్కడున్న కుర్చీ దూరంగా లాక్కుని కూర్చుంది.

కొడుకుతో ఆడుకుంటున్న శేఖర్ వెంటనే తల ఎత్తాడు. 'హోటల్ భోజనం' అతన్ని తల ఎత్తేటట్లు చేసింది. 'నే నొక మూల చెప్పబోతుంటే ఆ తొందరెందుకు నీకు? ఆ రేజరు పని చెయ్యటంలేదని కత్తి నూరి వుంచాను. కాస్త యిా గెడ్డం గీసుకోవాలి' అన్నాడు చెంపలు చేత్తో రాసుకుంటూ.

'ఆదివారం కూడ తొందరేనా? ఆ గడ్డ మేదో తర్వాత గీకొచ్చును. మిమ్మల్నే పెళ్లి కూతురు చూడరావటంలేదు కదా! వీణ్ణి కాస్సేపు ఆడిస్తే నా పూజ, వంట అయి మీకు కంచంలోకి పదిగంటలకి అన్నం వస్తుంది' అంది. ఆ తర్వాత మీ యిష్టం అన్నట్లు కూర్చుంది.

'వీణ్ణి ఆడించడానికి నాకు టైములేదు. మాకు తొమ్మిదిగంటలకి రిహార్సలు. ఈరోజే కదా నాటకం. మళ్ళీ రాత్రికే నేను రావడం. ఆ వంట సంగతేదో ముందు చూడు. నేను వెళ్ళాక తీరుబడిగా పాలు పొంగించ వచ్చు' అనేసి చల్లగా అక్కడినుండి జారు కున్నాడామె పతిదేవుడు.

సుగుణ నిట్టూరుస్తూ లేచింది. 'ఆది వారంకూడ నా ప్రాణానికి విరామం లేదు కదా. పైగా సలహా కూడాను - తను వెళ్ళాక పాలు పొంగించాలిట. మిట్టమధ్యాహ్నం పాలు పొంగిస్తే, సూర్యభగవానుడు నన్ను మెచ్చి పుణ్యలోకాలకి పంపిస్తాడు' అంటూ వంటింటి వైపు వెళ్ళిపోయింది.

ఆ మాటలు శేఖర్ వినాలనే వుద్దే శంతో అన్నవేకనుక గదిలో గెడ్డం గీసు కుంటున్న శేఖర్‌కి బాగానే వినిపించాయి. ఆ పని పూర్తిచేసి వంటింటి గుమ్మంలో కొచ్చి నిలబడ్డాడు.

'ప్లీజ్, ఈ ఒక్క ఆదివారం నిన్నూ నన్నూ తిట్టుకోకుండా గడపేస్తే, వచ్చే ఆదివారంనుండి ఎక్కడికీ యింత పొద్దున్నే కదలను' అన్నాడు.

సుగుణ చురచురా చూసింది శేఖర్ని 'వచ్చే ఆదివారం నేనిక్కడ వుంటే కదా!' అంటూ నిర్లక్ష్యంగా ఎగరేస్తూ ముఖం తిప్పుకుంది.

సుగుణ కళ్లల్లో మెరుపు, పెదవులపై చిరునవ్వు శేఖర్ దృష్టినుండి దాటిపోలేదు. ఆమె ముఖం తిప్పుకునేలోపల ఒక క్షణం ఆ రెండూ ప్రతిఫలించాయి.

సుగుణకి మూడురోజుల క్రితమే తల్లి దగ్గరనుండి వుత్తరం వచ్చింది. 'సుగుణ అక్క, పిల్లలూ ఢిల్లీనుండి వస్తున్నారని, సుగుణ పెళ్ళికి రాలేకపోయినందుకు యిప్ప టికీ బాధ పడుతోందని, సుగుణని యిప్పుడు చూడకపోతే మళ్ళీ ఎన్నాళ్ళకు చూస్తానో అని రాసిందని, కనుక చంటాడిని తీసుకుని నువ్వు వచ్చావంటే మీ యిద్దర్నీ చూసి చాలా సంతోషిస్తుంది' అని ఆ వుత్తరంలోని సారాంశం.

ఆ రోజునుండి మొదలు — పుట్టింటికి వెడతానని సుగుణ, వద్దని శేఖర్.

శేఖర్ వెళ్లొద్దు అనడానికి కారణం లేక పోలేదు. ఆరు నెలల క్రితమే పుట్టింటికి వెళ్లి వచ్చింది మళ్ళీ యిప్పుడు ప్రయాణం అవుతోంది.

'ఆర్నెల్లకోసారి యిా ప్రయాణాలేమిటి? మీ అక్కనే యిక్కడికి రమ్మని రాయి. ఎలాగూ యింత దూరం వచ్చింది' అన్నాడు శేఖర్.

'వారం రోజులంటే వారం రోజులే వుంటానండీ—అంతకంటే ఎక్కువ రోజులు ఎవరు బలవంతంచేసినా వుండనంటే నమ్మండి' అంటూ ఎంతో నమ్మకంగా చెప్పింది.

'నాకిష్టంలేదు' అంటూ ఆ రోజు ఆ సంభాషణ అంతటితో ఆపేశాడు శేఖర్

# మీ ముఖ కాంతికి కొన్ని కళలను తీరుస్తుంది




మెత్తగా,
మృదువుగా,
యౌవనంగా
వుంచుతుంది–ఏదో తెలుసా ?

పాండ్స్ వ్యానిషింగ్ క్రీము. అందులో గల ప్రత్యేకమైన హ్యూమెక్టెంట్ దుమ్ము వాతావరణాలకు తగిన సంరక్షణను ఇచ్చుటయేగాక చర్మానికి సహజంగా వుండవలసిన ఆర్ద్రతకు భంగం రానీయదు. తేలికగా మంచులా వుండే పాండ్స్ వ్యానిషింగ్ క్రీము వాడండి. మ్యాట్ ఫినిష్‌కు దానిని ఒక్కటే వాడవచ్చు. లేకపోతే మీ సింగారం చెక్కు చెదరకుండా గంటలకొద్దీ వుండడానికి పౌడర్ పునాదిగా వుపయోగించవచ్చు. 4 సైజులలో లభించగల వ్యానిషింగ్ క్రీము ఇదొక్కటే: ఎకానమీ - లార్జి - మీడియము - స్మాలు.

## పాండ్స్ వానిషింగ్ క్రీమ్

విశిష్టమైన పౌడరు పునాది.

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమిత బాధ్యతతో యు. ఎస్. ఎ లో స్థాపితము)

# ఫలించని పథకం

మళ్లీ యీ రోజు అదే మాట. తను వెళ్లితీరతాను అంటోంది. సుగుణ పుట్టింటికి వెడతానన్నప్పుడల్లా శేఖర్‌కి దిగులే. వెళ్లిన మనిషి వెంటనే రాదు. అతని ఓర్పుని పరీక్షించడానికా అన్నట్లు, నెల రోజులు మకాం వేస్తుంది. టెలిగ్రాం యివ్వకపోతే మొగుడనేవాడొకడు యిక్కడున్నాడని గుర్తే రాదు అంటాడు. ప్రతిసారి టెలిగ్రాం యిస్తే ముక్కున వేలు వేసుకుంటారు అంటుంది, సుగుణ.

సుగుణ పుట్టింటికి ఎప్పుడు ప్రయాణం పెట్టుకున్నా సాధ్యమయినంతవరకు శ్రమపడి ఆటంకాలు వెతుకుతాడు. ఇప్పుడుకూడ సుగుణని ఆపడానికి బలమైన కారణాలు అన్వేషిస్తున్నాడు.

ఇదివరకు సుగుణ భర్త సృష్టించే అవరోధాల వెనక వున్న అనురాగానికి, ప్రాధేయపూర్వకమైన చూపులకి కరిగి కొన్నిరోజులు ప్రయాణం వాయిదా వేసేది. ఈసారి చాలాకాలానికి వచ్చే అక్కని చూడాలని ఎంతో ఆతురతతో ప్రయాణం పెట్టుకుంది. అనుకున్నరోజుకే వెళ్లాలని గట్టి పట్టుదలతో వుంది.

శేఖర్ భోజనంచేసి రిహార్సలుకి బయలుదేరాడు.

'సాయంత్రం అయిదున్నరకల్లా ఆఫీసు కారు వస్తుంది. నువ్వు సిద్ధంగా వుండు' అని చెప్పేసి వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం పనులన్నీ చక చకా పూర్తి చేసుకుని, బాబుని తీసుకుని పక్కింటికి వెళ్ళింది.

'ఏం సుగుణా, యిలా వచ్చావు' అని అడుగుతూ బాబుని సుగుణ దగ్గరనుండి తీసుకున్నారు.

'ఇవాళ మీ అల్లుడుగారు వేసే నాటకం వుంది, పిన్నిగారూ. వాళ్ల యూనియన్ యూనివర్సరీ ఫంక్షన్‌కి ఏర్పాటు చేసుకున్నారుట. మీరొస్తారేమో అడుగుదామని వచ్చాను' అంది.

'నువ్వు వెడుతున్నావంటే అది బాగుండే నాటకమే అనుకోవాలి. అల్లుడువేసే నాటకాలకి నువ్వు వెళ్ళడం నేను వేళ్ళ మీద లెక్కపెడుతున్నాను' అంటూ నవ్వారావిడ.

సుగుణకి జవాబివ్వడానికి ఏమీ లేనట్లు నవ్వేసి వూరుకుంది.

'నాకు యివాళ రావడానికి వడదు, సుగుణా. కావలిస్తే బాబుని యిక్కడ వుంచేసి వెళ్ళు. నాటకం అవుతుండగా వీడు ఏడిస్తే—మధ్యలోనే లేచి రావలసి వస్తుంది' అంటూ సలహా యిచ్చారు.

'ఆ మాట నిజమేనండోయ్, పిన్నిగారూ! ఆ రోజు వీడి ఏడుపు మీకూ జ్ఞాపకం వుందా? ఎన్ని విధాలుగా చూశాం వీణ్ణి సముదాయించాలని! సినిమా మధ్యలో బయటికి వచ్చేశాం వూరుకోబెట్టడం మన వల్లకాక' అంది.

'అందుకే వీణ్ణి యిక్కడ వుంచేసేయి. నేను చూసుకుంటాను. ఆ పాలసీసా అవీ యిచ్చి వెళ్ళు. ఇంతకీ ఒక్కర్తివే వెళుతున్నావా?' అని అడిగారు.

'కారు పంపిస్తానన్నారు. మరి నే వెళ్ళి బాబుకి కావలసినవి పట్టుకొస్తాను. టైమవుతోంది' అనేసి యింటికొచ్చింది.

బాబుకి అవసరమైన సరంజామా అంతా పిన్నిగారికి యిచ్చి వచ్చేసరికి కారు గుమ్మంలో ఆగి వుంది. ఇంటికి తాళంవేసి కార్లో కూర్చుంది. ఆ కార్లో సుగుణ కాక మరి ముగ్గురాడవాళ్లు వున్నారు. వాళ్ళు శేఖర్ సహోద్యోగుల భార్యలు. వారిలో యిద్దరి భర్తలు ఆ రోజు నాటకంలో వేషాలు వేస్తున్నారు. ఒకామె భర్త దర్శకత్వం వహిస్తున్నాడు. మాటల సందర్భంలో సుగుణ తెలుసుకున్న విషయాలు అవి. వారిద్దరూ తమ భర్తల నటన చూడడానికి వస్తున్నారు. మరి తనో...అతను వేసిన నాటకం చూస్తే—అతను సంతృప్తిపడి (ఎప్పుడోకాని రావడానికి యిష్టపడదు కనుక) తను పుట్టింటికి వెళ్ళడానికి వెంటనే అనుమతి ప్రసాదిస్తాడని ఆశిస్తూ వెడుతోంది.

సుగుణావాళ్లు అక్కడికి చేరేసరికి నాటకం ప్రారంభించేశారు. సుగుణ ప్రక్కనే దర్శకుని భార్య కూర్చుంది.

నాటకం మొదలుపెట్టిన కొద్దిసేపటికి శేఖర్ పాత్ర ఏమిటో తెలిసింది సుగుణకి. నాయకుడి పాత్ర. నాటకాలంటే యిష్టపడని సుగుణ, శేఖర్ ఏ పాత్ర తీసుకున్నాడో అడగలేదు. అతను చెప్పలేదు. సుగుణ ఎప్పుడూ అడగదు కూడ. ఆ నాటకంలో నాయికగా నటిస్తున్న అమ్మాయి

చాలా నాజూగ్గా నన్నగా పొడుగ్గా వుంది.

శేఖర్, ఆ అమ్మాయియొక్క ప్రేమ ఘట్టాలు వచ్చినప్పుడల్లా ప్రేక్షకుల్లోంచి వినిపించే ఈలలు, చప్పట్లు వినలేక, పక్కనే వున్న ఆడవాళ్ల ముసి ముసి నవ్వులు భరించలేక—ఏదో ఒక వంక చెప్పి యింటికి పోదామా అనుకుంది సుగుణ.

శేఖర్, ఆ అమ్మాయి స్టేజిమీదకి వచ్చినప్పుడల్లా తలవంచుకుని కూర్చోవాలనిపించేది సుగుణకి. కానీ, పక్కన కూర్చున్న దర్శకుని భార్య ఈర్ష్య అనుకుంటుందేమోనని గుడ్లప్పగించి నాటకం చివరిదాకా ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంది. కోపం, దుఃఖం, ఆవేదన పెనవేసి సుగుణని క్రుంగదీస్తున్నాయి.

ఎంత చనువు లేకపోతే ఆ అమ్మాయితో అంత యిదిగా నటించగలడు? అతని నాటకాల్లో అభిరుచికి తగినట్లు తను లేకపోవడమేనా దీనికి కారణం? ఆ అమ్మాయి వాళ్ళ ఆఫీసుకి సంబంధించిన అమ్మాయే అయితే...

సుగుణ తనలో వున్న శక్తినంతా కూడదీసుకుని పక్కనే కూర్చున్న దర్శకుని భార్యని అడిగింది 'ఏమండీ హీరోయిన్‌గా వేస్తున్న అమ్మాయి బాగా నటిస్తోంది. వీళ్ళ ఆఫీసులో పనిచేస్తున్న అమ్మాయేనా? పేరేమిటో?'

'నాకు పేరు తెలియదండీ. దీన్లో వేసే వాళ్ళంతా ఒక ఆఫీసు తాలూకు వాళ్ళే. ఈ నటకంలో నటించే అందరి పేర్లు అసలు పేర్లే గుర్తించినట్లు లేదు. చాలా ఆడ పాత్రలున్న నాటకం మొదట వేద్దామనుకున్నారట. కాని వాళ్ళ ఆఫీసులో అమ్మాయిలు వప్పుకోలేదట. నాటకం మార్చి రాసుకున్నారని తెలిసింది. ఈ అమ్మాయి ఒక్కర్తే సమ్మతించి వచ్చింది. ఆడపాత్ర లేకపోతే ఏం బాగుంటుంది చెప్పండీ' అని సాగదీసింది ఆవిడ.

'ఆ ఆడపాత్రే నాకొంప ముంచేటట్లుంది కదండీ' అనుకుంది మనసులో. తను అడిగిన దానికి అంత పెద్ద జవాబు వస్తుందని సుగుణ అనుకోలేదు.

అయితే ఆ లెక్కన ఆ అమ్మాయి పేరు శ్రీదేవి అన్నమాట. చక్కని పేరు. శేఖర్ పక్కన ఆ అమ్మాయి చక్కగా సరిపోయింది అనుకుంది. తను ఎప్పుడు శేఖర్ పక్కన నిలబడినా పొట్టిగా వున్నట్లు తలచేది. ఆ అమ్మాయి తనకంటె పొడుగు. శేఖర్‌కి తగ్గ పొడుగు వుంది.

ఇంతకు ముందు అతను వేసిన నాటకాలకి (కొన్నిటికి) రానట్టే దీనికి కూడ తను రాదు అనుకున్నాడేమో! అందుకే అంత యథేచ్ఛగా నటించగలుగుతున్నాడు. అది నటనేనా???

"జనగణమన'తో ఆనాటి కార్యక్రమం పూర్తయింది.

'గ్రీన్ రూమ్‌కి వస్తారా వెడదాం' అని దర్శకుని భార్య అడుగుతూంటే సుగుణ యీలోకంలోకి వచ్చింది.

సుగుణకి వెళ్ళాలని లేదు. కానీ శేఖర్ తనని ఒక్కర్తినే వెళ్ళి పొమ్మంటాడో, తను కూడ వస్తానంటాడో తెలుసుకోవాలి కదా అని ఆమెతోపాటు నడిచింది.

సుగుణని గుమ్మం దగ్గర వదలి నివరో పిలిస్తే ఆవిడ వెళ్ళిపోయింది. సుగుణ అక్కడి నుండీ నాలుగ్గపక్కలా చూసింది. ఆ గదిలో చాలా మందే వున్నారు. సిగరెట్లు కాలుస్తూ కొందరు, కాఫీతాగుతూ కొందరు, రెండు పన్నూ వదలి నోటికి మాత్రమే పని చెప్పిన వారు కొందరు వున్నారక్కడ.

సుగుణ కళ్ళు అప్రయత్నంగా ఒక చోట నిలిచి పోయాయి. ఒకమూలగా శేఖర్ కూర్చుని వున్నాడు, అతనికి ఎదురుగా ద్వారం వైపు వీపుపెట్టి ఆ అమ్మాయి అదే హీరోయిన్‌గా వేసిన అమ్మాయి కూర్చుని వుంది.

అలా మూలగా కూర్చుని ప్రపంచాన్నే మరచిపోయినట్లు ఒకరితో ఒకరు నవ్వుతూ నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. శేఖర్ భుజం మీద చెయ్యివేసి మరీ మాట్లాడుతోంది. ఆ అమ్మాయి. సుగుణకి కళ్ళు గిర్రున తిరిగిపోతున్నట్లుంది. వాళ్ళ దృష్టిలో పడకుండా తొందరగా వెళ్ళిపోవడమే వుత్తమం అనుకుంటూ వెను దిరిగింది.

'సుగుణా'

సుగుణ కాళ్ళకి బంధం పడినట్లయింది ఆ పిలుపుకి. నెమ్మదిగా వెనక్కి తిరిగింది.

'వెళ్ళిపోతున్నావేం? నేనూ వచ్చేస్తాను ఆగు' అన్నాడు శేఖర్.

'మీరు వచ్చేదాకా యిక్కడే నిలబడతాను. మీ పని యింకా అవలేదా?' కంఠాన్ని అదుపులోకి తెచ్చుకుని మామూలుగా అడిగింది

'నాకేం పెద్దపని లేదు. నా ఫ్రెండుకి నిన్ను పరిచయం చేస్తాను రా రోహిణికి'



అని పిలుచుకెళ్ళాడు లోపలికి.

సుగుణ తడబడే కాళ్లతో అతని వెంట నడిచింది. ఆ అమ్మాయి కూర్చున్న వైపే తీసుకెళ్ళాడు శేఖర్. ఆ అమ్మాయి కనుబొమలు ముడిచి చూస్తోంది వచ్చే యిద్దరినీ.

'అప్పుడే ఎంత అన్యాయం ... తనంత అందగత్తెని కాననా ఆ చిన్నమాపు? తాను తప్ప యింకెవరూ తన ప్రేమికుని ప్రక్క నిలబడడానికి అర్హులు కారా?' యిలా సాగిపోతున్నాయి సుగుణ ఆలోచనలు.

'ఈమె నా శ్రీమతి. పేరు సుగుణ.'

'శేఖర్ కంఠధ్వని చిన్నదిగా వున్నా సుగుణకి శంఖారావం చెవిలో పూరించినట్లుంది ఆ సమయంలో.

'నమస్తే' అంది తడబడుతూ.

'ఈమె వస్తున్నారని చెప్పలేదే నువ్వు' అంది నవ్వుతూ ఆ అమ్మాయి.

'నాకే తెలీదు. నీకేం చెప్తాను' అన్నాడు శేఖర్.

సుగుణ కాళ్ళకింద భూమి కదలిపోతున్నట్లుంది. ఇద్దరిమధ్యా సంబోధన ఏకవచనంలోనే సాగుతోంది. పునాది గట్టిపడిన స్నేహమే అనుకోంది. సుగుణ వుని

# ఫలించని పథకం

కినే మరచి యిద్దరూ కబుర్లలో పడ్డారు మళ్ళీ. సుగుణ నెమ్మదిగా అక్కడినుండి తప్పుకుంది.

సుగుణ ద్వారందాటి, పక్కగా స్తంభం వుంటే అక్కడ నిలబడింది. అప్పటికే అందరూ వెళ్ళిపోయారు. ఏ అయిదారుగురో వున్నారు అక్కడ. 'పనేం లేదని యింకా ఆ కబుర్లేమిటో యిద్దరికీ' అని విసుక్కుంది. కొంతసేపు ఓర్పుగా చూసి పిలవడానికి లోపలికి వెళ్లిపోయింది. గుమ్మంలోనే ఆగిపోయింది.

'నీకు మనస్ఫూర్తిగా నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను. మన పథకం ఫలించింది.' అంటూ శేఖర్ ఆ అమ్మాయివీపు తడుతున్నాడు.

అక్కడ కూర్చున్నది అమ్మాయి కాదే అనుకుంటూ రెప్పవాల్చకుండా చూసింది. తన కళ్ళని తనే నమ్మలేక తెల్లబోయింది లోపలి దృశ్యానికి.

ఆ చీర కట్టుకున్న వ్యక్తికి క్రాస్ క్రాప్. ఆడ మొహం. ఒక చేతిలో విగ్గు— ఒక చేతిలో సిగరెట్టు.

'వెళ్ళు — ఆవిడ బయట ఎదురు చూస్తున్నారో — తిరిగి యింటికెళ్ళి అలకపాన్పు పరిచారో' అంటూ నవ్వుతున్నాడు అతను.

'నే వెడుతున్నా — రేపు వుదయం యింటికి రా— కలిసే వెడదాం ఆఫీసుకి'. అని చెప్పుతూ శేఖర్ ద్వారం వైపుగా నడిచాడు.

శేఖర్ రావడం చూసి దూరంగావెళ్ళి నిలుచుంది సుగుణ.

ఇద్దరూ మౌనంగా యిల్లు చేరుకున్నారు ఆ రాత్రి.

మర్నాడు వుదయం శేఖర్‌తోబాటే సుగుణకూడ తొమ్మిదిగంటలకే భోజనం చేసింది. సూట్‌కేసు, హోల్డాలు తెచ్చి సావిట్లో పెట్టింది. అర్థంకాక శేఖర్ అయోమయంగా చూశాడు.

'నేను పదిగంటల బస్సుకి మా వూరెడుతున్నాను' అంది సుగుణ నిదానంగా కుర్చీలో కూర్చుని తమలపాకులకి సున్నం రాస్తూ.

ఇకముందు జరగబోయే నాటకంలో తామిద్దరే పాత్రధారులు అని మనసులోనే చెప్పుకుంది.

'ఇవాళా ... మంచిరోజు నాలుగయిదు రోజుల తర్వాతే వుందన్నావు' విస్మయంగా అడిగాడు.

'పక్కింటి పిన్నిగారు యివాళ కూడ మంచిరోజే నన్నారు. ఎంత తొందరగా వెడితే అంత తొందరగా వచ్చెయ్యొచ్చని...' తమలపాకులు, వక్కపొడి శేఖర్ చేతిలో పెట్టింది.

అవి నోట్లో వేసుకోవాలనే ధ్యాసే లేదు అతనికి.

కాస్సేపు యిద్దరూ మాట్లాడుకోలేదు.

'ఇవాళ శ్రీదేవిగా నటించిన అమ్మాయి మనింటికి వస్తానంది' అంటూ ఆ నిశ్శబ్దాన్ని భంగపరిచాడు శేఖర్.

'ఎప్పుడొస్తుంది' ఆత్రుత కనబరుస్తూ అడిగింది.

'ఆఫీసుకి కలిసే వెడదామంది. ఇప్పుడే రావచ్చు.'

'ఆ అమ్మాయి బాగా నటించిందండీ. తప్పకుండా నా అభినందనలు తెలుపుతాను. నిన్నరాత్రే చెప్పాల్సింది. ఏమిటో బుర్రపని చెయ్యలేదు' అంది నొచ్చుకుంటూ.

'నీకు బస్సుకి టైమవుతోంది. నువ్వు



పొరుగునుండి వచ్చాక మాట్లాడొచ్చు. రిక్షాకి ఎవరైనా వెళ్ళారా' అని అడిగాడు.

'పనిమనిషి వెళ్ళింది. నే వెళ్ళేలోపలే ఆ అమ్మాయివస్తే అభినందనలు తాజాగా అందుకుంటుంది' అంది ఉత్సాహంగా.

'ఆ అమ్మాయి యిక్కడే వుంటుంది' అన్నాడు చేతిలోవున్న పుస్తకం చూస్తూ.

'వంట వస్తే ఫరవాలేదు. మీకు హోటలుకూడా తప్పుతుంది' అంది.

శేఖర్ తలఎత్తి సుగుణని తీక్షణంగా చూశాడు. సుగుణ ముఖంలో బాధాచిహ్నాలు ఏవీ కనిపించలేదు.

'వంట చెయ్యాల్సిన ఖర్మేం పట్టింది ఆ అమ్మాయికి'

'నేను వచ్చేదాకా హోటలు కూడు తప్పదన్నమాట మీకు. అసలా అమ్మాయి యిక్కడెందుకుంటోంది' అని నెమ్మదిగా అడిగింది.

దార్లోకి వచ్చింది అనుకున్నాడు శేఖర్.

'నేనే వుండమన్నాను యిక్కడ' అన్నాడు ముఖంలో ఏభావం వ్యక్తం కానీకుండా.

'నేను వచ్చేదాకానా? అయినా వాళ్ళ వాళ్ళు వూరుకుంటారా?' అని సందేహం వెలిబుచ్చింది.

'నువ్వొచ్చాకకూడ యిక్కడేవుంటుంది.' రెండో ప్రశ్నకి జవాబివ్వలేదు.

'వాళ్ళ వాళ్ళు వూళ్ళోలేరా' అంది రెండో ప్రశ్నకి సమాధానం రాకపోయేసరికి.

'ఇకమీదట అన్నీ నేనే' అన్నాడు.

సుగుణ తల వంచేసుకుంది ఆమాట వినగానే.

'మీ వాళ్ళని తీసుకొచ్చి గొడవచేస్తే ఏం ప్రయోజనం వుండదు. ఇప్పుడే చెప్తున్నా—అప్పుడు ఏడ్చికూడ ప్రయోజనం వుండదు.'

సుగుణ వంచిన తల ఎత్తలేదు. నెమ్మదిగా 'ఏడవను. మీరలా చెపితే అలాగే' అంటూ నోటికి కొంగు అడ్డుపెట్టుకుంది.

అంతవరకు సుగుణ ధైర్యానికి ఆశ్చర్యపోతున్న శేఖర్, భార్య నోటికి కొంగు అడ్డంపెట్టుకోవడం చూసి స్థిమితపడ్డాడు.

'నువ్వు తొందరపడి రాకు. నీకు ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడే వద్దువుగాని' అన్నాడు.

అప్పుడే ఒకతను లోపలికొచ్చాడు:

'మీ యింటి ముందు రిక్షా ఆగివుంది, శేఖర్' అన్నాడు.

అతని వెనకేవచ్చిన పని మనిషి 'రిక్షా వచ్చింది. అమ్మగారూ' అంది.

సుగుణ సామాను రిక్షాలో పెట్టించింది.

సుగుణ తను ఆశించిన మార్పుకి భిన్నంగా ప్రవర్తించేసరికి నీరుగారిపోయాడు శేఖర్.

'వెళ్ళక తప్పదన్నమాట' అన్నాడు దిగులుగా రిక్షాలో కూర్చున్న సుగుణకి బాబుని అందిస్తూ.

శేఖర్ ప్రక్కనే నిలుచున్న అతన్ని చూపిస్తూ 'శ్రీదేవిగారు పక్కనుండగా దిగులెందుకు' అంది.

రిక్షా సాగిపోయింది. ●

పిల్లలు—ఆరోగ్యము

# మానసిక గ్రహణశక్తులు

పిల్లలు పుట్టినది మొదలు నెల రోజుల లోగా ప్రక్కలకి వొత్తిగిల్లగలరు. తలను నిలుపలేరు. మామూలుగా ముడుచుకొని పడుకుంటారు. ఒక వస్తువుపైన దృష్టిని నిలపలేరు.

మొదటి నెలకి గడ్డమును పైకెత్తి చూస్తారు. దృష్టిని ఒక వస్తువుపై నిలుప గలరు. కొద్ది కొద్దిగా ఏదైనా ఒక వస్తువుని చూపిస్తే చూపుని దానివైపు మరల్చ గలరు. తలని నిలపటం మాత్రం వేయలేరు.

రెండవ నెలలో చిరునవ్వు నవ్వుతారు. శబ్దాన్ని విని పరికించి చూస్తారు. కదిలే వస్తువు వెంబడి దృష్టిని తిప్ప గల్గుతారు.

మూడవ నెలలో తలని కొద్దిగా తిప్పి చూస్తారు. సంగీతం అంటే ఆసక్తి కనపరుస్తారు. 'అంగా' అనే శబ్దం నోటి వెంట వస్తుంది.

నాలుగవ నెలలో చిన్న చిన్న వస్తువులని తీసుకుని నోటి దగ్గర పెట్టుకుంటారు. తల పూర్తిగా నిలప గలుగుతారు. ఎవరైనా పట్టుకుని కూర్చోపెడితే చాల సంతోషంగా కనిపిస్తారు. నిల్చోపెడితే కాళ్ళతో తన్న గలరు. పలకరిస్తే కేరింతలు కొడ్తారు.

ఏడవ నెలలో దొర్లటం ప్రారంభిస్తారు. ఎవరైనా పట్టుకుంటే కూర్చో గలరు. పెద్ద వస్తువులని ముందుకు వంగి గ్రహించి నోటి దగ్గరకి తీసుకొని వెళ్ళగలరు. ఒక్క చేతినించి ఇంకొచేతికి వస్తువులని మార్చ గలరు. అద్దం చూసుకోడం అంటే యిష్ట పడతారు.

పదవ నెలలో పిల్లలు పాక గలరు. ఒకరి సహాయం లేకుండా కూర్చో గలుగుతారు. బొటన వేలు, చూపుడు వేళ్ళతో వస్తువుని పట్టుకో గలరు. ఎవరైనా ఆ వస్తువుని పట్టుకుంటే వదిలి వేయగలరు. దాచిన వస్తువులని తీయడానికి ప్రయత్నిస్తారు. అమ్మ, తాత, అనే మాటలు వస్తాయి. 'టాటా' చెప్పడం నేర్చుకుంటారు.

మొదటి సంవత్సరంలోగా ఒక చేతో పట్టుకుంటె నడవ గలరు. కుర్చీలు, మంచాలు పట్టుకుని నడువ గలుగుతారు. బట్టలు తొడిగేటప్పుడు సహకరించ గలరు. అమ్మ తాత కాక యింకా రెండు మాటలు నేర్చుకుంటారు.

ఒక సంవత్సరం దాటిన తర్వాత మూడవ నెలలో తమకి తాముగానే పిల్లలు నడవ గలుగుతారు. మెట్లు ఎక్కడం నేర్చుకుంటారు. తెలిసిన వస్తువుల పేర్లు చెప్ప గలుగుతారు. కావల్సిన వస్తువుని వేలెట్టి చూపించగలరు.

సంవత్సరంన్నర వయసులో పిల్లలు పరిగెత్త గలగటం, చిన్న కుర్చీలో కూర్చోవటం కొన్ని మాటలు మాట్లాడటం, తమంతట తామేఆహారం తీసుకొనగలగటం గమనించవచ్చు.

రెండు సంవత్సరాల ప్రాయంలో పిల్లలు బాగా పరిగెత్త గలరు. మెట్లు దిగ గలుగుతారు. చెంచాని బాగా పట్టుకో గలగటం, బట్టలు విప్పడానికి సహాయపడటం చేయ గలరు. బొమ్మల కథలందు ఆసక్తి కనపరుస్తారు. మరో ఆరు నెలలలో గుర్తుపట్టడం, పూర్తి పేరు చెప్పడం అలవాటు అవుతుంది.

మూడు సంవత్సరాలకి మామూలుగా ఒక కాలు వెంబడి మరో కాలువేసి నడువ గలరు. ఒంటికాలుమీద నిలబడతారు. మూడు చక్రాల సైకిల్ తొక్కడం అంటే ఆసక్తి కనపరుస్తారు. చెయ్యి కడుక్కో గలుగుతారు.

నాలుగు సంవత్సరాల వయసులో నిచ్చెన ఎక్కడానికి ప్రయత్నిస్తారు. కత్తెరతో కత్తిరించగలరు. ఆటలు మొదలు పెడ్తారు. తామకు తామే కాలకృత్యాలు తీర్చుకోడానికి పోగలుగుతారు.

అయిదవ సంవత్సరంలో స్కిప్పింగ్ వస్తుంది. బరువులని లెక్కించ గలుగుతారు. రంగుల పేర్లు చెప్ప గలుగుతారు. తమకు తామే బట్టలు వేసుకో గలుగుతారు. ఈ వయసులోనే పెద్దలని అనేకరకాల ప్రశ్నలతో విసిగిస్తుంటారు.

—డా. కె. వెంకటేశ్వరరావు




**జ రి గి న క థ**

ఒక వ్యక్తిమీద అనేక అభిప్రాయాలు వున్నట్టే—ఆ ఆస్పత్రిమీద కూడా అనేకానేక మంచీ—చెడూ అభిప్రాయాలున్నాయి. సూర్యానికి ఆ ఆసుపత్రి అంటే ఒకరకమైన భయం. తీరా అతనుకూడా అందులోనే చేరాల్సి వచ్చింది. ఆ వార్డులో ఇంకా శెట్టిగారు, శ్రీనివాసు వున్నారు. ఆసుపత్రిలో చేరాక సూర్యానికి గత మంతా కళ్లముందు కదలింది. అతను యవ్వనంలో ప్రవేశించగానే మొట్టమొదటిసారిగా విశాలాక్షి మీదకి మనసు పోయింది. సూర్యం చెల్లెలు గౌరి, ఆమె జ్ఞాపకం రాగానే అతని కళ్ళలో నీళ్ళు నిండాయి. గౌరి భర్త గోవిందరావు ముక్కు సూటిగా ప్రవర్తించేవాడు. అతనితో ఎప్పుడూ గొడవే. గోవిందరావు అకస్మాత్తుగా హాస్పిటల్లో మరణించాడు. అందుకే హాస్పిటలంటే అతనికి భయం. విశాల ఎడబాటు అతన్ని మరీ క్రుంగదీసింది.

# 7

చివరకు యే వార్తయైతే వూహించడానికి వెరచాడో అదే వచ్చి పడింది. శుభలేఖ చూసి పైన విశాలాక్షి పేరు చూడగానే వరుని పేరే చదవలేదు. ఆ శుభలేఖను ఆఫీసులోనే చెత్తబుట్టలో వేసేసాడు. మిగతా రోజంతా కాలుకాలిన పిల్లిలా తన సీటువదలి యేపనీ చెయ్యకుండా తిరిగాడు. విశాల యింకొకరి సొత్తు కాబోతోందంటే తను నమ్మలేకపోతున్నాడు. తను జీవితంలో యే సుందరి కోసం దట్టమైన అడవులను దాటగలిగాడో ఆ సుందరి తను రాగానే యింకొకరి స్వాధీనం కావడం చూస్తే మనస్సెంత పట్టు తప్పుతుందో తనూ అలానే అయ్యాడు.

ఇంటికి వచ్చిన కొడుకును చూసిన తల్లి వెంటనే 'యెందుకు నాయనా అలా వున్నావ్' అంది. తల్లి ప్రాణం. ఆమె కొడుకుముఖభంగిమలు చూసి పోల్చేసింది.

'ఏం లేదమ్మా' అన్నాడు.

'ఏంటో నాయనా నీ సంగతి నాకేం బోధపడలేదు' అని అక్కడ నించి వంటయింట్లోకి వెళ్లిపోయింది. కాఫీ కప్పు తెచ్చి అందిచ్చింది. అందుకుని ప్రక్కనే పెట్టాడు.

'తాగేటట్టే వుంది'

'కొద్దిగా చల్లారనీ అమ్మా' అన్నాడు.

తల్లి దగ్గర నేలపై కూర్చుంది.

'ఏం వుత్తరాలు వచ్చాయా ?'

'లేదు...హాఁ వచ్చింది.'

'ఎక్కడనించి ?'

'విశాలకు పెళ్లని శుభలేఖ వచ్చింది'

'ఎప్పుడు?'

'ఏమో?'

'ఇదేమిటి నాయనా—ఏదీ శుభలేఖ.'

'ఆఫీసులో మరచిపోయాను.'

'ఒక్క కుటుంబంలా మెసలాం. ఒకసారి నివ్వు పెళ్లికి వెళ్లకూడదూ ?'

'నే నెక్కడకూ వెళ్లను.'

'అలా అంటే యెలా నాయనా?'

'నాకు శలవు లేదమ్మా. ఉన్న శలవంతా రోగాలకే అయిపోతుంటే.'

'ఏ రోగాలైనా వస్తాయి. నీ సంగతి నాకేం నచ్చలేదు నాయనా! ఇదివరకిలా లేవు. ఈజురోమని వుంటే రోగాలేకాదు దరిద్రం కూడా దగ్గరకు వస్తుంది. శ్రమ, కీడు, జబ్బు శరీరానికి దుఃఖం యిస్తాయని పెద్దలంటారు. వాటివల్లే మనసుకు దుఃఖం వస్తుంది. ఆ దుఃఖం వచ్చేటప్పుడు కాసింత ఆశతో నవ్వకపోతే నీ చదువంతా బూడిదలో పోసిన పన్నీరే నాయనా! పొరుగు మామ్మ అంటుండేది—ఒక కన్ను యేడిస్తే యింకో కన్ను నవ్వాలి అని.'

'కన్నీరు రెండుకళ్లనించి ఒక్కసారే కారుతాయమ్మా.'

'అవును. అందులో ఒకటి దుఃఖం వలన, యింకొకటి సంతోషంవలన కారుతుంది.'

సూర్యం అమ్మవేపు ఒకసారి చూసాడు. ఆమెకు తన ప్రవర్తన నచ్చలేదని ఆమె ముఖంలో భంగిమలే చెప్తున్నాయ్. ఈ వేళ యెటూ వెళ్లలేదు. రాత్రి నిద్దర కూడా సరిగ్గా పట్టలేదు. తను మంచంమీద పడుకున్నాడు. తల్లి రెండో గదిలో చాపమీద పడుకుంది. ఆమె నిద్దరపోతోంది. తల్లి గురించి తలచుకున్నాడు. ఆమె వాళ్ళ ఇంట్లో ఇల్లాలుగా కాలు పెట్టినప్పటికి పదిహేనేళ్ళయినా నిండలేదు. అత్త లేని ఇల్లు. ఒంటిగా భర్తకు, మామకూ సేవ చేయాలి. తోడూ—నీడా యింకెవరూ లేరు. జరుగుబాటు లేని కొంప తాలూకు భారం ఆమె నెత్తిమీద పడింది. తినకుండా పడుకున్న రాత్రుళ్ళుండేవి. మనిషి కనీసపు

కోర్కె కడుపుకు సంబంధించినది. ఆ కోర్కె తీర్చుకోలేని పరిస్థితి. ఆకలి కడుపు అగ్గిమంటలను రేపి హృదయాన్ని, మనస్సును కాల్చివేస్తుంది. ఆ మంటల వలన ఆమె బేజారెత్తి ఒకర్ని కించపరచలేదు, ఒకరిది అపహరించలేదు, ఒకరిని కష్టపెట్టలేదు. నోటిలో మంచిమాట, ముఖంలో చిన్న నవ్వు, ప్రవర్తనలో మర్యాద— ఇవే పువ్వులు చేసుకుని దేవుని పూజించినట్లు కలిగిన వాళ్ళతో ప్రవర్తించింది. తనబాధ, తన దుఃఖం, ఆమె పడ్డ దానిలో యెన్నోవంతు. ఎదిగిన కూతుర్ని పోగొట్టుకుంది. పచ్చగా సంసారం చెయ్యవలసిన యింకో కూతురి మాంగల్యం తన కళ్ళ యెదురుగా తెగిపోయింది. కూతురిని ఓదార్చడానికి వెళ్ళిపోకుండా కులదీపకుడని యీ కొడుకు మేరిచి చెడ్డలు చూడటానికి యింట్లో పిల్లలని, భర్తనూ, సంసారాన్ని వదలి తన దగ్గర వుంది.

అలాంటి తల్లికి తను నిత్యం నిర్జీవంగా వుండి యెంత దుఃఖాన్ని కలిగిస్తున్నాడు. ఇన్ని కష్టాలూ, ఒడుదుడుకులూ భరించగలిగిన ఆ తల్లి కడుపున పుట్టినందుకైనా తనకు కొంత ఆమె గుణాలు అబ్బవలసింది. ఆమెకులేని చదువు యిచ్చినంతైనా తన చదువు యీయకపోతే తన చదువుకు విలువలేదు. తను యిలా వుండటానికి కారణమేమిటి? తను గుండె జబ్బుకు లోనయ్యాననే కదా? అందుకే విశాలకు దూరం కావలసి వచ్చిందని కదూ? ఒకప్పుడు గుండెజబ్బు లేకపోయినా ఉమ్మడి కుటుంబానికి తన బాధ్యతలను మరచిపోయి యేమీ చెయ్యలేకపోయేవాడు. అతని మనస్సులో ఆదిపీఠం తల్లి. ఆ తల్లిని వదలి తను వుండలేడు. ఆ తల్లి తనను యెంత కష్టపడి కన్నదో, ఆశలతో పెంచినదో ఆ ఆశలను వమ్ముచేసి తను సుఖపడలేడు.

తనే తెగించి విశాలను పెళ్లి చేసుకుంటె తన చెల్లెళ్ళకు పెళ్ళిలా అవుతుంది? తన తమ్ముళ్లకు పిల్లలెవ్వరిస్తారు? విశాలకున్న రూపం, యౌవ్వనం ఆమె జీవితంలోని మధురాన్ని తను కాంక్షిస్తున్నాడు. ఇవేవి శాశ్వతం కాదు. తను ఆమెను కట్టుకుని పొందిన సుఖం పొందిన ప్రియమైన బిడ్డలు, ఆర్జించి



ధనం యివికూడా శాశ్వతంకాదు. శాశ్వతమైనది బాధ్యతను సక్రమంగా నిర్వర్తించి పొందిన తృప్తి. తను అందమైన విశాలను కట్టుకుని, తనకు అంతకుముందు సంక్రమించిన బాధ్యతను వదులుకోవటం అన్యాయమౌతుంది. ధర్మవిరుద్ధంగా పోయినట్లు అవుతుంది. ధర్మంకోసం నెపం వెతకటం అన్యాయమని తను యెక్కడో చదివాడు.

తన తల్లిని తల్చుకుని తన బాధ్యతలు నెమరు వేసుకోగానే తనలోని నిరాశ కడుగుకుపోయినట్లు అయిపోయింది. మళ్లీ తను అర్థంలేని ఆవేదనతో మంచంపడితే కోలుకోవటం కష్టమన్న భయం కూడా తనను ప్రవాహంతో కొట్టుకునిపోతూ వడ్డునుంచి విసరిన తాడుకోసం తాపత్రయ పడినట్లు చేసింది.

కన్నీటి చుక్కలతో బంగారువద్దాలు, కళ్లమూపులతో చంద్రకిరణాలు సృష్టించుకోడానికి ప్రయత్నించాడు. ఎనుపోతుల్లా ముందుకువచ్చే మేఘాలు ఢీకొని మెరుపును సృష్టించినట్లు అతని నిరాశ నిండిన ఆలోచనలు ఢీకొని ఒక ఆశాకిర

# నాలుగుమంచాలు

ణాన్ని సృష్టించాయ్! ఆ శబ్దంతో అతను మేల్కొన్నాడు.

ఆ మరుసటిరోజు ఆఫీసుకు వెళ్లి చూసేసరికి శుభలేఖ లేదు. ఉదయమే స్వీపరు చెత్తకాగితాల బుట్టలన్నీ ఖాళీచేసి కాల్చేసాడు. అతని మనసు గురించి విశాలనూ చెరిపివెయ్యాలని చూస్తున్నాడు. ఏ పెయింట్‌తో బొమ్మలను గీస్తారో ఆ పెయింటే ఆ బొమ్మలను చెరపడానికి ఉపయోగించాలి. ఆమెపైనున్న అనురాగాన్నే ఆమెను మరచిపోడానికి వినియోగించాడు. ఇప్పుడు విశాల తనదికాదు. ఆమె దగ్గరగా చేరడానికి తనకు హక్కులేదు. ఆమె మెడలో పడిన మూడుముళ్ళు మంగళసూత్రాన్ని మెరపించే క్రొత్త మెరుపులను మెరపిస్తాయ్. ఆ మెరుస్తున్న మంగళసూత్రంలో గడచిన ప్రతిబింబాలు కనపడవు. ఎదురుగా నిల్చున్న వ్యక్తిరూపును ఆకర్షిస్తుంది. మూడుముళ్లు మెదడు వెనుకభాగానికి తాకి గతాన్ని మరపించి క్రొత్త ఆలోచనలకు చోటిస్తాయ్. హోమగుండం యెదురుగా జంటగానడిన యేడడుగులూ గడచిన సప్తజన్మాల అనుభూతులను జ్ఞప్తికి తెచ్చి మనసులను యేకం చేస్తాయ్.

విశాల తనను అంతగా ప్రేమించి వుంటే యీ పెళ్లికే ఒప్పుకునేది కాదన్న భావన కలగగానే సూర్యం తియ్యని కలగని తెలిసి తెచ్చుకున్నట్లు అయ్యాడు. శరత్కాలంలో నిత్యం అనుకున్న పూవు గ్రీష్మంలో పరిమళం ఉడిగి కళాహీనమైనట్లు విశాల గురించి యిప్పుడు అనుకున్నాడు. తనలో అనవసరంగా కన్నీరు రక్తంగా వర్షం కురిపించుకున్నందుకు బాధపడ్డాడు. ఈ జీవితం ఒక రైలు బండిలాంటిది. రైలుబండికి టైమ్‌టేబిలు వున్నట్లే యీ మనిషికి ఒక టైము టేబులు వుంటుంది. తను ఆ టైమ్‌టేబిలు ప్రకారమే నడవాలి. తనకూ విశాలకూ ఒక ఆకులో తినాలని వుంటే ఆమె తన జాతిలోనే వుట్టేది.

ఇలా క్రొత్త ఆలోచనలు పూలకుప్పలుగా పోసుకుని సూర్యం దాన్ని తెరుచుకున్నాడు. పాత ఆలోచనలు వాడిపోగానే క్రొత్త ఆలోచనలు అంతకంటే ఆశాజనకంగా సృష్టించుకోసాగాడు. మేఘంలో మెరుపులా విశాల కనిపించి మాయమైంది. ఆ మెరుపుకోసం నిత్యం తను బాధపడి పొంద లేదు. నింగిపై నిలవని మెరుపుకోసం బాధపడేకంటే నీటిలో కదిలే చందమామను చూస్తూ కూర్చుంటే నయం అనుకున్నాడు. ఆ చందమామను నీటెక్కడున్నా చూడవచ్చు ఒక్క దగ్గర కాదు నాలుగు చెరువులుంటే నాలుగు దగ్గరలలో చూడవచ్చు. చందమామను అందుకోవాలని తనకు లేదు. అతను అందుకోలేడని తనకు తెలుసు. కానీ ఆ అందాన్ని మాత్రం చూస్తూ ఆస్వాదించకుండా వూరుకోలేడు. అందుకే సూర్యం సినిమాలకీ, సాయంత్రవేళ రోడ్డుమీదా తిరిగేవాడు. అందమైన అమ్మాయిలు చలాకీగా నడుస్తూ పోతుంటే చూసేవాడు. తప్పిచెడి యే అమ్మాయైనా ఒకసారి తనవేపు చూస్తే తనూ చూసేవాడు.

ఒకేవిగ్రహం, చెట్టూ, పువ్వూ కళ్ళ చేదుకనివ్వదు. పూలసముదాయం, చెట్లతో



మీకు అది చేస్తాం. ఇది చేస్తాం అని చెప్పి మోసం చేసి ఓట్లు అడగను. నేను ఏదీ చెయ్యను. దయతో మీ ఓట్లు నాకే వేసి గెలిపించండి.

క్రిష్ణవేణి

నిండిన ప్రకృతి, పదిరకాల విగ్రహాలుగా మన్న యౌవ్వనులూ యెంచటానికి అవకాశం యిచ్చి ఆనందాన్ని అధికంగా చేస్తాయి. ఎంచిన రూపలావణ్యం ముగ్ధని చేసుంది.

విశాలను మరచిపోడానికిచేస్తున్న ప్రయత్నాలు ఆమెను రోజూ జ్ఞప్తికి తెస్తున్నాయ్. ఆమెను మరచిపోవటం అంత కష్టం కాదేమో కాని ఆమె వదలిన జ్ఞాపకాల్లాంటి చివరి సంఘటనలు అతనిలో యెగురుతూనేవున్నయ్. ఇవి సంతోషం పొందడానికి తల్చుకుని చివరకు కన్నీళ్ళు గుటకలు మింగేటట్లు చేసేవి. తన జీవితంలో ఆడదాన్ని చూసీ చూడటంతో మనస్సు చెలించటం ఒక్కసారే కలిగింది. అది విశాలను చూసాకే! ఆ చూపులు ప్రసరించిన ముఖం మనఃఫలకంమీద వులితో చెక్కిన రాతిబొమ్మలా వుంది. అవి చెరపటం అతని శక్యంకాదు.

ఆశానిరాశలమధ్య యుద్ధం జరుగుతున్న సమయంలో ఒక కవరు వుత్తరం వచ్చింది. కవరుమీద యెడ్రసు రాసిన అక్షరాలు యెక్కడో చూచినట్లుంది. అది

# నాలుగు వంచాలు

విశాలది కాకూడదూ? విశాల తననింకా మరచిపోలేదు. తొందరగా విప్పాడు. ఇంగ్లీషులో రాసివుంది.

'ప్రియమైన సూర్యం! యీ వేళ పేపర్లో ప్రకటన చూసేవుంటావ్: ఆ ఆఫీసరు గిరికి కావలసిన యోగ్యతలు నీకున్నయ్: తప్పక దరఖాస్తు పంపిస్తావని ఆశిస్తున్నాను.

నీ శ్రేయోభిలాషి
సచీంద్రనాథ సర్కార్'

సూర్యం తన పాత ఆఫీసరు పెద్దహోదాకు వెళ్ళినా తనను మరచిపోనందుకు సంతోషించాడు. దరఖాస్తు పంపించాడేగాని తను ఆఫీసరునవుతానన్న నమ్మకం తనకు అంతగాలేదు. జ్యోతిష్యం మీద పోయిన నమ్మకం కొద్దిగా ఆశపెట్టిస్తోంది. తనలాంటి యోగ్యతలున్న వాళ్ళు వేలాది వున్నారు. తనకు పైవాళ్ళకన్న అనుకూలత వుంది.

తను ఆ డిపార్టుమెంటులోనే వుండి అన్నిరకాలపనులలో తర్ఫీదు పొంది వున్నాడు.




అతను యింటర్వ్యూకు ఢిల్లీ వెళ్ళడానికి యిప్పటినించే తయారుకా సాగాడు. అమ్మతో అసలు విషయం చెప్తే చాలా సంతోషించింది. 'అదృష్టం కలిసిరావాలి నాయనా, నీకేం కొదవ. తెలివితేటలు లేవా? ఆకారం లేదా? లేనిపోని ఆలోచనలు పెట్టుకోకపోతే తిన్నది వంటపట్టుంది. కంటికి కనిపిస్తావు. నివ్వా పెద్ద హోదాలో వుంటే నీ తరవాత వాళ్ళను పైకితెస్తావు. మన కుటుంబాలలో గౌరవం వస్తుంది. అధికారంవచ్చిందని అన్యాయం చెయ్యకపోతే పదుగురూ నీ తల్లి తండ్రికి మొక్కుతారు.'

'ఏంటమ్మా అప్పుడే నేను ఆఫీసరు అయిపోయినట్లు మాట్లాడేస్తున్నావ్.'

'పెద్దలు పేరంటాళ్ళూ చెప్పినది వమ్ముకాదు నాయనా! జాతకబలంకి మించిన బలంలేదు. నా బాబు గొప్పవాడవుతాడు. వాడికేం కాదన్న ధీమా లేకపోతే యీమధ్య వచ్చిన కష్టాలను ఆదుకోగలిగేదాన్నా? దేముడు దొడ్డవాడు నాయనా! కష్టాలు మంచి వాళ్ళ మంచికే యిస్తాడు. అతని వరాలవి. వాటిని సంతోషంగా స్వీకరించాలి.'

అమ్మ యీమధ్య ఆమె బ్రతికి సంపాదించిన అనుభవాలను చెప్తోంది. అది అబద్ధం అనే సాహసం సూర్యంకు లేకపోతోంది.

* * *

సూర్యం ఢిల్లీ యింటర్వ్యూకు వెళ్ళాడు. వెళ్ళేముందు యింటర్వ్యూ పద్ధతులు యిదివరకు వెళ్ళి నెగ్గుకొచ్చిన ఆఫీసర్లు చెప్పగా విన్నాడు. వాళ్ళంతా తనకు విజయం చేకూరాలని కాంక్షించారు. ఒక ఆఫీసరు తన తాలూకు సూటు, టైతో సహా యెరువిచ్చాడు. బూట్లు తనే కొనుక్కున్నాడు. టై కట్టుకోవటం యెలానో నేర్చాడు. ఇంట్లో అంతా ఒకసారి రిహార్సల్ చేసుకున్నాడు. సూటు వెయ్యగానే తను కాస్త లావుగా కనిపించాడు. తల్లి చూసి ముచ్చటపడి 'అప్పుడేనైనా ఒకటి అలాంటిది కుట్టించుకో నాయనా' అంది.

ఇంటర్వ్యూ బోర్డులో ఒక మెంబరుగా సచీంద్రనాథ సర్కార్ వున్నాడు. తనకు హెచ్చు ప్రశ్నలు వేసింది అతనే. మొదట కొద్దిగా కాళ్ళు వణికినా తరవాత త్వరగా క్లుప్తంగా జవాబులు చెప్పాడు. బయటకు

వచ్చాక తను నెగ్గుకొచ్చానన్న తృప్తి కలిగింది. ఐనా మనసులో నెగ్గినా లాభమేమి టనే సంశయం వేధించుక తింటోంది.

ఇంటికి తిరిగి వచ్చేసరికి తల్లి అప్పటికే యెన్నో దేవుళ్లకి మొక్కింది. విన్నపాలతో పాటు ముడుపులు తీసింది. ఈ పూజలూ, ఆ పూజలూ చెయ్యిస్తానని హామీ యిచ్చింది.

'బాగా చెప్పావుకదా నాయనా?'

'ఏదో చెప్పాను'

తప్పకండా వస్తుంది'

ఏంటో తనకు లేనిధీమా అమ్మకు. అతనికి అన్నీ సంశయాలే. తను సంశయాల తోనే పుట్టినట్టుంది. అమ్మ సంశయం యెరగదు. అయితే అవును లేకపోతే కాదన్న తత్వం. నిరాశను ఆశ అనే ధైర్యం ఆమెది. సూర్యం, తన కెందుకా గుణం అబ్బలేదని విసుక్కున్నాడు.

కొద్ది రోజుల ఆందోళన తన పేరు నెగ్గినవారి లిస్టులో వున్నదన్నవార్త విన గానే పోవలసింది పోలేదు. పెచ్చింది. తనకున్న గుండెజబ్బును ముగ్గురు డాక్టర్లున్న బోర్డు గుర్తించి తనను పనికి రాడని నిర్ధారిస్తుంది. దానిమూలాన తన ప్రస్తుత ఉద్యోగం పోయేఅవకాశం వుంది. అంచేత బోర్డుముందుకు వెళ్లాలా వద్దా అన్న సంశయంలో పడ్డాడు. జీవితంలో యెల్లవేళలయందు అవకాశాలు అదృష్టాలూ వెంటపడవు. వెంటపడిన యీ ఒక్క అవ కాశాన్ని వదలుకొని జీవితకాలం విచారించు కొని వుండటం దేనికి? ఆ డాక్టర్లనే బ్రతిమాలుతానని అనుకుని మెడికల్ బోర్డు ముందు నిల్చున్నాడు. ముగ్గురు డాక్టర్లు అన్ని విధాలా పరీక్షించారు. రక్తం తీసి పరీక్షకు పంపించారు. ఎల్క్ట్రోకార్డియోగ్రాం (ఈ. సి. జి) తీసారు. గుండెను తనిఖీ చేసారు. వక్షాన్ని ఎక్స్‌రే తియ్యాలనగానే సూర్యం ఆలోచించుకున్నాడు. కంపౌండరు చెప్పింది అక్షరాల నిజం. జ్యోతిష్యం అబద్ధం.

అంతా అర్జంటుగా అప్పటి కప్పుడే ఆ బోర్డుకు పెద్ద జరిపించాడు. (పక్క

గదిలో విచారంతో క్రుంగిపోయిన సూర్యంకు కబురువచ్చింది పెద్ద డాక్టరు 'టేబిలు' యెదరగా కుర్చీమీద కూర్చోమని ఆహ్వానించాడు. కూర్చున్నాడేగాని గుండెదడ హెచ్చింది. అతను సహజమైన చిరు నగవుతో

'మీ ఆరోగ్యం బాగుంది. ఫిట్‌సర్టిఫికేట్ పైకి పంపించివేస్తాం'

సూర్యం తన చెవులనే నమ్మలేక పోయాడు. 'ఎక్స్‌రే తీసారు. ఏమైనా అనుమానం వుందేమో అనుకున్నాను'

# నాలుగు మంచాలు

'అనుమానంమీదే తీసాను. మిమ్మల్ని అన్‌ఫిట్ చెయ్యటానికి కాదు. ఏమైనా లోటుపాట్లుంటే సలహా యివ్వడానికి'

'ఏమైనావుంటే సంశయించక చెప్పండి'

'ఏమీలేదు. మీ గుండె మీ వయసుకు, మీ అస్థిపంజరానికి సరిపడ్డట్లే వుంది. కాస్త పెరిగినట్లు అనిపించటానికి కారణం మీ శరీరంలో మాంసం కండలు తక్కువ కావటం వలన మీరు ప్రతిరోజూ ఒకమైలు దూరం పరుగెత్తండి. సరియైన ఆహారం తినండి. మీ వెయిట్ పెరుగుతుంది.'

'ఆహారం హెచ్చుతింటే అరగదండి.'

అతను నవ్వాడు. 'ఎందుకరుగుతుంది? కొద్ది నిమిషాలు మిమ్మల్ని చూసాక మీ గురించి తెలుసుకోగలిగాను. మీ రెల్లప్పుడూ ఆలోచిస్తూ మౌనంగా కూర్చుంటారనుకుంటాను. ఈ అనవసరపు ఆలోచనలవలన జీర్ణాశయం దెబ్బతింటుంది. మీరు సంతోషంగావుంటూ సరియైన వ్యాయామం చెయ్యకపోతే మీకు అజీర్ణవ్యాధి వచ్చే అవకాశం వుంది; మీకంటె వయసులో పెద్దవాడ్ని. కాస్త సలహా యివ్వవచ్చనుకుంటాను'

''దయచేసి తప్పక చెప్పండి'

'మనిషి భయంతో బతికే యుగమనది. ఈ భయం రావటానికి కారణం మనం మనగురించి మనదేశం గురించే తల్చుకోవటం. ఇలా తల్చుకోడానికి కారణం మనకున్న అత్యాశ. ఈ అత్యాశ మరచిపోతే గనీ మనిషికి నేను నేననే అహం పోదు. ఆ అహం పోతేగానీ మనిషి తనకో ఆత్మ వుందని గుర్తించలేడు. ఆత్మ, దయ, సహనం, త్యాగాన్ని ప్రదర్శించేటట్లు యీ జీవి చేస్తుంది ఈ లోకంలో దుఃఖం ప్రక్కనే సుఖం వుంటుంది. కుళ్ళు కాలవ ప్రక్కనే మీరు చూడగలిగితే గడ్డిమొక్కలు అందమైన గడ్డిపూలతో వుంటాయ్. కుళ్ళు కాలవనే విచారంతో చూస్తూ కూర్చోకండి. ఆ ప్రక్క గడ్డిపూలవేపు చూడటానికి ప్రయత్నించండి. పెద్ద లెక్చరైపోయింది. మీకు యిదంతా తెలియనిది కాదు,'

'మీ సలహాకు కృతజ్ఞుడ్ని. గడ్డిపూలవేపు చూడటానికి ప్రయత్నిస్తాను.'

సూర్యంకు తను ఆఫీసరునయ్యానన్న సంతోషంకన్నా తన ఆరోగ్యంతో యింకో జన్మ యెత్తానన్న వుత్సాహం హెచ్చింది. అందులో సాదరంగా పెద్ద డాక్టరు యిచ్చిన సలహాను మళ్ళీ మళ్ళీ తలచుకున్నాడు. ఒకచోట రాసుకున్నాడు. ఎప్పుడైనా తను తప్పిజారి మళ్ళీ లేనిపోని ఆలోచనలలో మున్నిప్పుడు అదొకసారి చదివితే మనసు త్రిప్పుకోవచ్చు. అమ్మ, అంతా సవ్యంగా వెళిపోయిందని చెప్పగా ఆనందభాష్పాలు రాల్చింది. కళ్ళు తుడుచుకోకండా.

పళ్లు—గుణాలు

## నిమ్మపండు

నిమ్మపళ్ళను సాధారణంగా మన ప్రాంతంలో ఉరగాయగా పెడతారు. పెసరపప్పు అన్నంలోను, మజ్జిగా అన్నంలోను, కొన్నిరకాల పచ్చళ్లలోను నిమ్మపండు రసం పిండుకొని భుజించే అలవాటు మన ప్రాంతంలో చాలా మందికున్నది. మంచినీళ్లలో నిమ్మపండు రసం పిండి— పంచదార కలుపుకొని కొంత మంది త్రాగుతూంటారు.

నిమ్మపండు చలవచేసి ఆర్పుతుంది. ఆకలిని, జీర్ణశక్తిని వృద్ధి పొందిస్తుంది. త్రిదోష హరమైనది.

దారుణమైన పైత్యాలు, అరుచి, దాహం, ఎక్కిళ్ళు, చర్ది, కఫం, గుల్మం, పాండువు, మలబద్ధం, మతిభ్రమ, దురదలు, స్థావర జంగమ విషములు — ముక్కు, మోహం, కంఠం వీనియందుపుట్టే రోగాలు, వాతం,శూల యివి తగ్గుతాయి.

ఈ పండు రసం శరీరంలోని దుష్ట పదార్థ కూటమిని విప్పుతుంది. సారా మొదలయిన మత్తు పదార్థాల యొక్క మత్తును హరిస్తుంది. రక్తంలోని వేడిని, కడుపులోని మంటను, వికారాన్ని అణుస్తుంది. భోజనం చేసిన వెంటనే వాంతి అయే గుణం కడుతుంది.

హిస్టీరియా వల్ల ఎవరికైనా గుండెదడ సంభవిస్తే — సుమారు ఒక అవున్సు నిమ్మ రసం వారికివ్వండి, గుండెదడ తగ్గుతుంది. పైత్యశూల, వాంతులు ఉన్నట్లయితే— సోడాలో నిమ్మపండు రసం కలిపి యివ్వండి.

నాలుక అసహ్యంగా వుండి, అరుచిగా ఉన్నట్లయితే— నిమ్మపండు రెండు ముక్కలుగా కోసి ఒకముక్క ఉప్పు చూర్ణంలో అద్ది, నాలుక మీద కొంచెం సేపు రుద్దండి. అరుచి పోతుంది.

దగ్గుగల వారికి, వాతశ్లేష్మ తత్వం గలవారికి నంజువ్యాధి గల వారికి యిది అపథ్యమయినది. నిమ్మపండు పరగడుపున తినకూడదు. తింటే పొట్టకు హాని చేస్తుంది. వాతం, శ్లేష్మం చేస్తుంది. తలకు, గుండె యొక్క నరాలకు, ప్రేగులకు అపకారం చేస్తుంది.

ఈ పండు యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు :— 1. తేనె. 2. పంచదార. 3. ఉప్పు. 4. ఖర్జూరపు పళ్ళరసం. 5. ఆరికబియ్యం.

## బత్తాయి నారింజపండు

మన ఆంధ్రప్రదేశ్‌లో పాలకొల్లు ప్రాంతము బత్తాయి నారింజ పళ్ళకు ప్రసిద్ధి.

ఈ పండు పథ్యమయినది. చలవ. మేహశాంతి చేస్తుంది. రక్తంలోని అతివేడిని, పైత్యాన్ని, కాక దగ్గును అణచివేస్తుంది. జబ్బుపడి లేచినవారికి, బలహీనులకు, రక్తాన్ని వృద్ధి పొందిస్తుంది.

వాతశ్లేష్మ తత్వాలు గలవారికి, వాతశ్లేష్మ జ్వరరోగాలు గలవారికి యిది అపథ్యకరమయినది.

ఇంచుమించుగా మామూలు నారింజ పండుకు గల గుణాలు చాలా వరకూ దీనికీ ఉన్నాయి.

ఈ పండు యొక్క దుర్గుణాలకు విరుగుళ్లు :— 1. ఉప్పు. 2. పంచదార, 3. సజ్జాకారం.

## పంపర పనాసపండు

ఇది చాలా పెద్ద సైజులో ఉంటుంది. నారింజ పండులో లాగే ఈడెలు ఉంటాయి. ఎర్రటి ఈడెలు, తెల్లటి ఈడెలు గల పంపర పనాసపళ్ళు మన ప్రాంతంలో లభ్యమవుతున్నాయి.

ఈ పళ్ళు చలవ చేస్తాయి. వాతం, శ్లేష్మం చేస్తాయి. అజీర్ణం, క్రిమిరోగం, భగందరం, నొప్పులు గలవాళ్ళకు ఈ పళ్ళు హాని చేస్తాయి. అపథ్యమయినవి.

ఈ పళ్ళ యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు :— 1. కరక్కాయ మురబ్బా. 2. పంచదార.

**సేకరణ: ఆకుండి నారాయణమూర్తి.**

'నాయనా భగవంతుడు నీచేత అధికారం యిచ్చాడు. అతని బిడ్డల కడుపు యెప్పుడూ పొరపాటునైనా కొట్టక' అంది.

ఈ అమూల్యమైన సలహా తన హృదయాంతరాళంలోనికి చొచ్చుకుని ప్రతిధ్వనించింది. ఎల్లప్పుడూ యీ మాతృదేవత కోర్కె టేప్ రికార్డు చేసినట్లు హృదయంలో నిల్చిపోయింది.

తనకు బొంబాయిలో ఆఫీసరుగా వేసినట్లు ఆర్డర్లు వచ్చేసాయి. అమ్మ అంత దూరం యిల్లు వాకిలీ వదలి రావటం కష్టం. అదీకాకుండా తనకింకా యిల్లే దొరకలేదు. బొంబాయిలో యిల్లు దొరకటం చాలా కష్టం అని విన్నాడు. తనకు తెలిసిన కొద్దిమంది ఆఫీసర్ల యింట్లో తను ఒక్కడైతే కొన్నాళ్ళు గడపవచ్చని ఒంటిగా వెళ్ళడానికి నిశ్చయించాడు. తన ఆఫీసరయ్యాడని వాళ్ళ కుటుంబాలలోనే కాదు, జాతిలోనే ప్రాకిపోయింది.

సూర్యం దగ్గరకు యెందరెందరో వచ్చారు, ఎంతో పొగడ్త సాగించారు. ఇదివరకు 'ఏం ఆస్తిపాస్తులున్నాయ్. గుమస్తా వుద్యోగమేనా? ఆ కుటుంబాన్నంతా యెత్తేసరికి సరిపోతుంది. మా అమ్మాయి ముద్దుముచ్చటలు ఆ గంపెడు సంసారంలో యేం తీరుతాయ్.' ఇలా అన్న వాళ్ళే సూర్యంకు పిల్లనిస్తామని ముందుకు వచ్చారు. అతని తల్లిని అమితంగా గౌరవించి ప్రతిమాలారు. పెద్ద పెద్ద హోదాలోనున్న వాళ్ళు బాగా డబ్బు పులిసినవాళ్ళు వేలకొద్దీ కట్నాలు యెరచూపించారు.

సూర్యం యిదంతా చూసి నవ్వుకున్నాడు. అతని తల్లికూడా ఒకవిధంగా ఒళ్ళు మండి 'నా కొడుక్కి కష్టం వచ్చినప్పుడు యీ చుట్టాలంతా యేమయ్యారు' అని మనసులో అనుకుని బయటకు మాత్రం 'ఈ రోజుల్లో మా యిష్టాలు పనికొస్తాయా? అబ్బాయి యిష్టం— వాడు పెళ్ళి వద్దంటున్నాడు.'

'తల నెరిసాక చేస్తావా రుక్మిణమ్మా. పెళ్ళిచెయ్యమంటారా పిల్లలు. వద్దే అంటారు. తల్లిదండ్రులు బాధ్యతతో ఒక ముడి పెట్టాలిగాని.'

'నేనిప్పుడు వేగలేనండీ. ఇంకో అమ్మాయి పెళ్ళికుంది.'

'కుంకుమపూడుములు వేద్దామా?'

'మీ అబ్బాయి యేంచేస్తున్నాడు.'

'వాడికి వుద్యోగంచేసే ఖర్మం వచ్చింది. నిక్షేపంలాంటి ఆస్తి. అది కాసుక కూర్చుంటే చాలు.'

'అమ్మాయి యెలా వుంటుంది?'

'దానికేం? అదో నిక్షేపంలా వుంటుంది.'

'అప్పుడే తొందర లేదమ్మా. బాబు పెళ్ళికి ఒప్పుకోవటం లేదు'

ఇలా యెన్నో సమాధానాలు చెప్పుకోలేక రుక్మిణమ్మ వూరికి కదలింది. బొంబాయి వెళిపోయే ముందు ఒకసారి స్వగ్రామం వెళ్ళాడు. ఆ గ్రామంలో పుట్టి తొలిసారి బి. ఏ. అనిపించుకున్నవాడు తనే—తొలిసారి ఆఫీసరైనవాడూ తనే! ఊరు వూరంతా అతనికి స్వాగతం యిచ్చింది. ఎందరెందరో యెన్నెన్నో ప్రశ్నలు వేశారు. కొందరు కలవాళ్ళు తను బొంబాయిలో వుండగా చూడడానికి వస్తామన్నారు. సూర్యం గౌరిని చూడలేకపోయాడు. హృదయం ఒకసారి స్పందించింది. ఆమెను భర్త చనిపోయినందుకు కాదు ఆమె భర్తను కలుసుకోకుండా చేసినందుకే తన్ను తాను క్షమించలేకపోతున్నాడు. అతను భార్యకు యేం చెప్పేవాడో? ఆ చివరి మాటల్లో యేదో ఒక కోర్కె వుండేది. ఆ అంతిమ కోర్కెను తీర్చి ఆమె జీవితాంతం తృప్తితో బ్రతికేది. ఆ తృప్తిని గౌరికి తను లేకుండా చేసినందుకే బాధపడసాగాడు.

(ఇంకా ఉంది)

## తత్త్వచింతన



ధర్మపథం * బులుసు వేంకటరమణయ్య

మోక్షప్రాప్తికోసం కొందరు తీర్థయాత్రలు చేస్తారు. కొందరు మంత్రాలను జపిస్తారు. కొందరు శాస్త్రాలను చర్చిస్తారు. కొందరు వీటిమీద ఆధారపడక తత్త్వాన్ని గురించే ఆలోచన సాగిస్తారు. పయి సాధనాలన్నింటిలోనూ తత్త్వ చింతన ఉత్తమోత్తమం.

తన తల్లి, పుణ్యం సంపాదించదలచి, గంగలో స్నానం చెయ్యడానికి కాశీక్షేత్రానికి వెళ్తూ ఉండగా, తత్త్వవేత్త అయిన వేమన్న ఒక రాగి డబ్బు ఆమె చేతికిస్తూ 'అమ్మా, గంగానదిలో దీనిని కూడా ముంచు, గంగాస్నానంవల్ల యీ రాగిడబ్బు వెండినాణెం అవుతుందేమో చూద్దాం' అని చెప్పి తీర్థస్నానంవల్ల చేసిన పాపాలు పోవడం కల్ల— అని తెలియజేసినట్లు ఒక గాథ ప్రసిద్ధంగా ఉన్నది.

మనస్సు పరిపక్వం కానప్పుడు ఏటువంటి సాధనాలవల్లనూ ఏమీ ప్రయోజనం ఉండదు. తీర్థయాత్రలు మొదలయినవి లోకానుభవం సంపాదించడానికీ, మనస్సులో కొంత పరిణామం కలగడానికి ఉపయోగపడవచ్చును. కాని వాటివల్లనే పరమప్రయోజనాన్ని సాధించగలమని అనుకోకూడదు.

ఈ విషయంలో క్రింది శ్లోకాన్ని గమనించవచ్చును—

'ఉత్తమా తత్త్వచింతా చ
మధ్యమం శాస్త్ర చింతనమ్,
అధమా మంత్ర చింతా చ
తీర్థభ్రాంత్యధమాధమమ్.'

దీని అభిప్రాయం—

సాధనాలు ఉత్తమం, మధ్యమం, అధమం, అధమాధమం అని నాలుగు విధాలు.

వీటిలో తత్త్వాన్ని గురించిన చింతన ఉత్తమమైనది. శాస్త్రాలను అభ్యసించి, వాటిని చర్చిస్తూ ఉండడం మధ్యమం.

కేవలం మంత్రాలవల్లనే సాధించవచ్చుననితలచి, వాటినిజపించడం అధమమైనది.

మరే పద్ధతినీ అవలంబించకుండా తీర్థయాత్రలవల్లనే ముక్తిని సంపాదించదలచడం కేవలం భ్రాంతి. ఆ తీర్థాటన అధమాధమమైనది. ●



## పెద్దకథ:

రాఘవయ్యగారు గట్టిగా విసుక్కున్నారు.

"చూడు మూర్తీ. అప్పుడే తొమ్మిద యింది. ఇంతవరకూ నాలుగు సార్లు బాత్‌రూమ్‌లోకి వెళ్ళాను. ఒక్కసారీ నీళ్ళు రాలేదు. నేనెలా స్నానం చెయ్యాలని?— చూడక, చూడక నాకు మంచి ఇల్లే చూశావు" — అన్నా రాయన భుజాన్ని తువ్వాలు వేసుకుని వచ్చి గదిలోని కుర్చీలో కూల బడుతూ.

నాకు రాఘవయ్య గారికీ ఇలాంటి సంభాషణలు తరచు మామూలే. ఆయనలా అంటున్నప్పుడు ఒక్కోసారి నాకు నవ్వు కూడా వస్తూ వుంటుంది. నవ్వితే మట్టుకు రాఘవయ్యగారు మండి పడతారు.—"ఈ ముసలాడు బాధ పడుతూవుంటే నీకు నవ్వులాటగా వుంటుంది. అందుకే నాకీ కుర్రాళ్లతో స్నేహం చెయ్యడం అంటే ఒళ్ళు మంట"—అంటారు బుసలుకొడుతూ.

నిజానికి— నాకు రాఘవయ్య గారికీ వయస్సులో దాదాపు ముప్ఫయియేళ్ళ వ్యత్యాస ముంది. ఆయన అరవయ్యోపడి తొలి భాగంలో వుంటే, నేను ముప్ఫయ్యోపడి స్వాగతద్వారాల దగ్గర వున్నాను. నాకు రాఘవయ్యగారికీ స్నేహం ఎందుకు కలిసిందో, ఎలా మొదలయ్యిందో నాకుసరిగా గుర్తులేదు గానీ— మేం ఒకళ్ళ నొకళ్ళు తొలిసారి కలుసుకున్న వేళా విశేషంమట్టుకు చాలా మంచిది. రిటైర్డు స్టేషన్‌మాస్టర్ రాఘవయ్యగారు నాకోమంచి కాలక్షేపం బటానీలా కనబడేవారు. "ఈ కుర్రా ళ్ళకి డిగ్రీలేగాని బొత్తిగా ప్రపంచ జ్ఞానం లేదోయ్— ఎం. ఏలూ, పి.హెచ్. డీలు చేసేసి పోగానే సరా మన సంస్కృతీ సంప్రదాయం పిల్లకేమి తెలుసని?—" అని ఆయన ఒక్కోసారి యువతరం మీద విరుచుకు పడినా, ఆ విసుర్లన్నీ నామీద నని తెలిసినా— రవ్వంత సహనం వహించి వచ్చి ఆయనతో మాటలు కలిపేవాడిని. మంచితన మనబడే నాస్వభావాన్ని చూచి రాఘవయ్యగారు ముచ్చట పడేవారు. యువ తరంలో వున్న లోపాలన్నింటిని నా మొహం చూసి క్షమించి నాతో స్నేహంకట్టే వాడు. మా ఇద్దరి మధ్య స్నేహం ఇంత బలీయమైంది కాబట్టే — ఎక్కడో మహా

రాణి పేటలో రాఘవయ్యగారిని దూరంగా వుంచడం ఇష్టం లేక డాబా గార్డెన్స్‌లోకి మాయింటికి దగ్గిరిగా ఆయనికి ఇల్లు చూశాను. అందులోని ఒక వాటాలో ఆయనిని దింపాను. అనగా దిగమన్నాను. నే చెప్పిందానికి ఒప్పుకోవడంలో ఆయన స్వార్థం కూడా వుంది. ఆయన మహారాణి పేటలో వుండేటప్పుడు ఎప్పుడో ఆదివారాలలో తప్ప రాఘువయ్యగారి దగ్గిరకు వెళ్ళేందుకు అవకాశం చిక్కేది కాదు— డాబా గార్డెన్స్‌లో అయితే యూనివర్సిటీనించి వచ్చిన తర్వాత ప్రతిసాయింత్రం నేను ఆయనతో కాలక్షేపం చేసేందుకు అవకాశం వుంటుంది. ఈస్వార్థంతోనే ఆయన డాబా గార్డెన్స్‌లోకి వచ్చారు.

అయితే— కథ ఇంతవరకూ బాగానే వుంది. అయితే— డాబా గార్డెన్స్‌లోని ఆ ఇల్లు మిధ్యా సుందరీదేవి గారిది కావడమూ, మిధ్యా సుందరికీ రాఘువయ్యగారికీ మధ్యవున్న సంబంధాలు ఇండో పాకిస్తాన్ వ్యవహారాల్లాగా పరిణమించడమూ, కాశ్మీరు సమస్యలాగా నీటి కుళాయి సమస్య తీవ్ర రూపం దాల్చడమూ కథ పాకాన పడేందుకు దోహదం చేశాయి. పానకంలోపడ్డ ఈగలాగా నేను ఈ మధ్యలో ఇరుక్కుపోయాను.

"నువ్వు వెయ్యి చెప్పు. లక్ష చెప్పు—మూర్తీ—ఆ మిధ్యా సుందరి వ్యవహారం మాత్రం నాకు సుతరామూ నచ్చలేదు. నీ స్నేహితురాలు కావచ్చుగాక— నాకేమీ భయం లేదు— డివిజినల్ సూపర్నెంటునే ఖాతరు చెయ్యని మనిషిని నేను—" కోపంతో రుసరుస లాడిపోతున్నారు రాఘువయ్య గారు.

రాఘువయ్యా గారికి నేనంటే ఎంత అభిమానమో, మిధ్యాసుందరితో నాకున్న పరిచయాన్ని చూస్తే ఆయనకంత ఒళ్లు మంట—ఇది చదివి మీరు—పాపం—యూనివర్సిటీ కుర్రాడు ఏదో అందమైనఅమ్మాయి కదా అని మిధ్యాసుందరితో స్నేహం చేసి వుంటాడు.—అంత మాత్రాన ఈ ముసలాడికి కోపం వచ్చెయ్యడమేనా?—కుర్రాళ్ళు వయస్సులో వున్న వాళ్లతో కాపోతే—ముసలాళ్లతో స్నేహం చేస్తారా? అని నన్ను సమర్థించడానికి తాపత్రయపడితే మీరు పొరబడ్డారన్న మాటే—నాకు మిధ్యాసుందరికీ స్నేహం అనే మీతోచెప్పాను గాని, మిధ్యాసుందరి వయస్సు ఫలానా, రూపం ఫలానా, అని మీకు చెప్పలేదు. —మన కథా నాయకురాలు మిధ్యాసుందరికి సమంగా యాభై ఏడు సంవత్సరాలు. గవర్నమెంటు హైస్కూలులో హెడ్ మిస్ట్రెస్‌గా పనిచేసి మొన్ననే రిటైరు అయింది. పూర్వసువాసిని అయిన మిధ్యాసుందరిగారి భర్త బతికున్న రోజుల్లో ఇంజనీరు పనిచేసి రెండు చేతులా, రెండు జేబుల్నిండా సంపాదించాడనీ, ఆడబ్బుతోనే రిటైరయి పోయిన తర్వాత డాబా గార్డెన్స్‌లో మిధ్యాసుందరి మేడ కట్టించిందనీ, లేకుంటే బడి పంతులమ్మకి మేడ ఎట్లా వస్తుందని కొందరు గిట్టని వాళ్లు, గిట్టిన వాళ్లు కూడా అంటూ వున్నందున దాన్ని మనం నిజంగానే భావించుకోవచ్చు. ఇకపోతే—ఈ మిధ్యా సుందరికి మా కుటుంబానికి దూరపు చుట్టరికమున్నందున ఆవిడ నాకు మొదటిలో బంధువుగా పరిచయమై ఆతర్వాత నాగర్ల్ ఫ్రెండు (ఆవిడను గర్ల్ అండానికి మీకే విధమైన అభ్యంతరం లేకపోతే) గా స్థిరపడిపోయింది.

ఇంతకూ నేను అసలు కథ చెప్పలేదు—మిధ్యాసుందరిగారి ఇంటికి వున్న ఓవర్ హెడ్ టాంకు మన ఆర్థిక వ్యవస్థలా అస్తవ్యస్తంగా పని చేస్తోంది. దానికి వంట్లో బాగుండి పనిచేస్తున్న కాసేపయినా ఆ నీళ్ళు రాఘువయ్యగారి క్రింది వాటాలోకి రాకుండా మిధ్యాసుందరి గారు అడ్డేస్తారు. రాఘువయ్య గారి మాటల్లో చెప్పాలంటే బట్టలు ఉతికే మిషతోనో, మంచినీళ్లు పడుతున్నామనే నెపంతోనో, స్నానం చేస్తున్నామనే వంక తోనో, నీళ్ళు కాస్తా క్రిందికి రాకుండా చేస్తారు. పొద్దున్నించి రాఘువయ్యగారికి స్నానం చేద్దామంటే అలవి కాకుండా వున్నదిట. ఈఘోరాని కంతటికీ కారణం ఈ ఇల్లు చూపించిన నేను—నాస్నేహితురాలనబడే ఈ యింటి యజమానురాలు మిధ్యా సుందరీను. ఇదీ ప్రాసిక్యూషన్ కథనం. డిఫెన్సువారి వాదం వేరే వుందనుకోండి—మధ్యన నేను ఐక్యరాజ్యసమితిలా ఇరకాటం పడిపోవాల్సి వచ్చింది. "మిధ్యా సుందరి గారు ఇంటి యజమానురాలు. ఆవిడకు ఈ ఇంటిమీద సర్వ హక్కులు, అధికారాలూ వున్నాయి. ఆవిడ స్వేచ్ఛకు మీరు అడ్డురావడం అక్రమం—" అనిగాని నేను అన్నానా— రాఘవయ్యగారు తన చేతికర్రకు పని కల్పిస్తారు. అంతే కాదు—తన ముప్ఫయిఏళ్ల సర్వీసులో ఎంతమంది పెద్ద ఆఫీసర్ల మాటలను కొట్టిపారేసిందీ—ఎంతమందికి ధైర్యంగా ఎదురు తిరిగి భట్టి విక్రమార్కుడిలా నిలబడ్డదీ, చెబుతూ, నాదేహానికి, బుర్రకీ కూడా పని కల్పిస్తారు. అందుచేత అంతటి సాహసం నేనెప్పుడూ చెయ్యలేదు—చెయ్యను.

ఇక పోతే — మిధ్యాసుందరి విషయం. ఆవిడ రాఘవయ్యగారిలా ప్రథమ కోపి కాదు. —చేసేదేమో చెప్పకుండా గుట్టు చప్పుడు కాకుండా చేసే రకం. స్త్రీల హృదయం అర్థం కాదనీ, అదొక అగాధమనీ, నాకు మిధ్యాసుందరిని చూచింతర్వాతే తెలిసింది. నాకు జీవితం సర్వీసులో దాదాపు ముప్ఫయ్యేళ్లు వచ్చేస్తున్నా నాకు సన్నిహితంగా వచ్చిన ఆడది మిధ్యాసుందరి ఒక్కతే. ఈ విషయం పైవాళ్లతో నేను అనకపోయినా, విషయం పసికట్టినవాళ్లు మాత్రం నన్ను "ఎలా వుందోయ్ నీ ఫ్రెండు?" అంటూ వేళాకోళం పట్టించే వాళ్లు—ఎవరేమి అంటేనేంగాని—ఒక్కటిమాత్రం నేను నిశ్చయంగా చెప్పగలను—జీవితంలో సగ భాగం దాటిపోయినా మిధ్యాసుందరి తన వయస్సును ఒప్పుకోదు— తనకోసం తనని అభిమానించే వాళ్ళుంటారనే ఆశ ఆవిణ్ణించి తప్పుకోదు. ఏళ్ళు పెరిగిపోతున్నా తనింకా 'ఆడపిల్ల' ననుకునే మిధ్యాసుందరిని చూస్తే నాకు నవ్వుకూడా వచ్చేది. మొత్తం మీద నేను చూరచిపోలేని వ్యక్తుల్లో మిధ్యా సుందరి ఒకతె.

"ఏమిటోయ్—ఉలకవు, పలకవు. నీ స్నేహితురాలిది తప్పని ఒక్క మాటంటే నీనోట ముత్యాలు రాలిపోవు—" రాఘువయ్యగారు మరోసారి కసురుకున్నారు.

ఆయనకు నేనేదో సమాధానం చెప్పేలోపున బాత్‌రూమ్‌లోని కుళాయిలోంచి నీళ్లు బడబడామని ధారగా పడటం ప్రారంభించాయి. గంగను సాక్షాత్కరించుకున్న భగీరథుడిలాగా రాఘువయ్యగారు థౌజెండ్ కేండిల్ బల్బువెలుగుతో తటాలున బాత్‌రూమ్‌లోకి దూరడంతో—"హమ్మయ్యా"

అని తేలిగ్గా నిట్టూర్చాను నేను.

* * *

ప్రక్క రోజు నేను యూనివర్సిటీ నించి వస్తూ ఓసారి రాఘవయ్య గారిని పలకరించి పోదామని ఆయన గదిలోకి వెళ్ళబోతే ఇంటి తలుపు వేసి వుంది. ఈ వేళప్పుడు ఎక్కడికి వెళ్ళి ఉంటారబ్బా అనుకుంటూ వెనక్కి తిరిగి పోదామను కుంటూ వుంటే, మేడమీదనించి మిథ్యా సుందరి నౌఖరు అండాళమ్మ నన్ను పిలుస్తోంది — "అమ్మగారు మిమ్మల్నోసారి రమ్మంటున్నారు—" అంది. మరేదో గొడవలా వుంది, అనుకుంటూ పైకి వెళ్ళాను.

నే వెళ్ళే సరికి మేడమీద వున్న డ్రాయింగ్‌రూమ్‌లో మిథ్యాసుందరి నవ్వుతూ నిలబడివుంది— "రామూర్తీ!— నీకోసం ఇప్పుడే నీ రూమ్‌కి కబురు పెడదామను కుంటున్నాను—నువ్వే కనబడ్డావు—" అంది.

మిథ్యా సుందరి ఆవేళ తలంటి పోసుకుని వాలుజడ వేసుకుంది. నీలంరంగు జార్జెట్ చీర, అదేరంగు జాకెట్టు వేసుకుంది. ఏళ్ళొచ్చి మీద పడ బట్టికాని— అచ్చు అందమైన కన్నె పిల్లలా కనబడి వుండేది మిథ్యాసుందరి— ఈ వయస్సు ఈవిడ్ని ఎంత అన్యాయం చేసిందీ అనిపించింది నాకు—"కూర్చో మూర్తి!—ఏమిటలా నిలబడిపోయావు—?" అంది మరోసారి నవ్వుతూ, నెరిసిన తెల్ల వెంట్రుకల్ని దాచాలని విశ్వ ప్రయత్నం చేస్తూ—

నేను ఆగదిలో కూర్చున్న కాసేపట్లోనే అండాళమ్మ రెండు ప్లేట్ల నిండా ఫలహారాలతో ప్రత్యక్ష మయింది. నేను ఆశ్చర్యంతో చూస్తూ వుండిపోయాను. —"మరేంలేదు మూర్తీ!— ఇవాళ నా పుట్టిన రోజు—ఏదో చిన్న సరదా అంతే—"

నిజం చెప్పొద్దూ—మిథ్యా సుందరి మాటలు వింటూంటే నాకు పెద్ద నవ్వు వచ్చింది. మనమల పుట్టిన రోజులు చెయ్యాల్సిన వయస్సులో ఓపిగ్గా ఈవిడ తన పుట్టిన రోజులు చేసుకొంటోంది. నిజానికి— మిథ్యాసుందరికి పిల్లలే లేనందున మనములన్న వారే లేరు— అందువలన వాళ్ళ పుట్టిన రోజులు జరుపాల్సిన ప్రసక్తే లేదు.—అందుచేత ఓ విధంగా ఆలోచిస్తే మిథ్యా సుందరి చేసిందాంట్లో సబబు లేని పని నాకేదీ అగుపించలేదు. "చాలా థేంక్స్—మంచి అకేషన్‌కి పిలిచారు నన్ను —మరి బర్త్‌డే కేండిల్స్ ఏవీ?"— అన్నాను జిలేబీ ముక్క విరిచి నోట్లో పెట్టుకుంటూ— ఇలా అనడంలో నాకు ఓ దుర్బుద్ధి లేకపోలేదు.—ఈమార్గంతోనయినా కొంత కాపోతే కొంత వరకయినా మిథ్యా సుందరి వయస్సు రాబట్టొచ్చని నా ప్రయత్నం.

నామాటలకు మరోసారి నవ్వుతూ— "నాకిలాంటి సెరమనీస్ అంటే పెద్ద పట్టింపు లేదు—ఆప్తులయిన ప్రియ మిత్రులెవరితోనో సంతోషంగా గడపడం మినహాగా నేనీ పుట్టిన రోజుకు పెద్దవిలువ ఇవ్వను"

గతుక్కుమన్నాను నేను— మిథ్యాసుందరి ఆప్తకోటిలో నేను ఉండడం నాకు చాలా ఆనందంగాను, గర్వకారణంగాను, కూడా వుంది. నాలోని మరో మానవుడు సరదాగా కాలరెత్తుకున్నట్టనిపించింది.

"నిజానికి నేను ఇవాళ ఇద్దర్నే పిలిచాను— ప్రొద్దున నీకోసం రూమ్‌కి కబురు పెడితే రోజుకన్నా త్వరగా యూనివర్సిటీకి వెళ్ళి పోయారన్నారు. ఇకపోనీలే, ఇంటిలో వుంటున్న మనిషి కదా అని రాఘవయ్య గారికి కబురు పెడితే—వస్తే వస్తాననీ, లేకపోతే రాననీ చెప్పొచ్చుకదా—అలా కాకుండా నాకూ, మీ యజమానురాలి పుట్టిన రోజుకు ఏవిధమైన సంబంధమూ లేదు— ఆవిడ పుట్టిన రోజుకు రావాల్సిన అవసరం అంతకన్నా లేదు— పుట్టినరోజు మిష పెట్టి ఏవో నాలుగు కాజాలు పెట్టి— మీరు పెడుతున్న ఇబ్బందు లన్నింటిని నన్ను మరచి పొమ్మంటారేమో—అదేం కుదరదు. —మీ ఆగడాలను నేను సహించబోయేది లేదు— ఓవర్ హెడ్ టేంక్ బాగుచేయించే దాకా నేను ఇంటిఅద్దె కట్టేదిలేదు— మీతో మాట్లాడేది లేదు—అంటూ పిచ్చి పిచ్చిగా నోటికొచ్చినట్లు మాట్లాడట— చూడు మూర్తీ—పుణ్యానికి పోతే పాపం ఎదురయిందంటారే అలావుంది నాపరిస్థితి. మర్యాదగా టీ పార్టీకి రమ్మని పిలిచిన వాళ్ళకు పెద్దమనిషి చెప్పాల్సిన సమాధానం ఇదేనా?—నువ్వేదో మర్యాదస్తుడనీ, ముసలాడనీ, (ఎదుట వ్యక్తుల ముసలితనాన్ని బేరీజు వెయ్యటంలో మిథ్యా సుందరికున్న ప్రతిభ మరెవరికీ లేదు—తను ఒక్కర్తే చిన్నపిల్ల అయినట్లు రాఘవయ్య ఒక్కడే ముసలాడు అయినట్లు మాట్లాడే మిథ్యా సుందరి మాటలు వింటూంటే నాకు తెగ నవ్వు వస్తోంది.) మరీమరీ చెబితే కాదనలేక అద్దెకిచ్చాను. లేకుంటే నేను ఒక్కర్తనూ ఉన్న ఇంట్లో పిల్లాపీచు ఎవరూ లేని రాఘవయ్యకు చస్తే అద్దెకుఇచ్చే దాన్నికాదు. ఇలాంటి అలగాజనం అంటే అసహ్యం నాకు—" అంది ఏక ధాటిగా మాట్లాడుతూ మిథ్యా సుందరి. కథ వామీదకే తిరిగి నందుకు గతుక్కుమన్నాను.



# సింథాల్ ఇచ్చే వాగ్దానం...

సంపూర్ణ లావణ్య పోషణ

నిత్య నూతన సౌరభం

సార్థక దుర్గంధ నివార్య రక్షణ

## ...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే




సింథాల్ ఒక్కటే జి-11 కలిగియున్న సబ్బు.
ఈ అద్భుతమైన క్రిమి సంహారక పదార్థము, శరీర
దుర్గంధమును, చర్మ దోషములను కలిగించు
క్రిములను రూపుమాపుతుంది. ఈ విధంగా సింథాల్
మీ లావణ్యమును నిష్కళంకముగా వుంచి,
మిమ్ము రోజంతా తాజాగా వుంచుతుంది.

Interpub, CSC/5/72R Tel

పకోడీలోని మిరపకాయని కొరకడంతో గడ గడా మంచినీళ్లు తాగేశాను. ఇక్కడే మరో విషయం చెప్పాలి. మిథ్యాసుందరి ఇంట్లో ఖాళీగా వున్న వాటాకు రాఘవయ్యగారిని సజెస్టు చేసినప్పుడు మొదట మిథ్యాసుందరి ఒప్పుకోలేదు— ఎందుకంటే —రాఘవయ్యగారి భార్య చాలాకాలం క్రిందటనే చనిపోయి నందునా అతడికి పిల్లలెవరూ లేనందునా, ఆయనఒక్కరూ బ్రహ్మచారిలాగా ఆ వాటాలో వుండాలి. నేను ఒంటరిగా వున్న 'ఆడ పిల్లను' బ్రహ్మచారులు నాయింట్లో వద్దన్నది మిథ్యాసుందరి. ఆవిడ మాటలు వింటూంటే తెగ నవ్వు వచ్చినా,—దాన్నంతటినీ ఆపు కుంటూ, మిత్రప్రేమ కొద్దీ రాఘవయ్యగారి పెద్దమనిషి తనం గురించి ఉపన్యాసం దంచి మిథ్యా సుందరిని ఒప్పించాను. ఇప్పుడు వాటన్నిటినీ వడ్డీతో సహా చెప్పుతోందావిడ— ఎరక్కపోయి వచ్చానుకదా ఈ బర్తుడే పార్టీకి అనుకున్నాను కాఫీ త్రాగుతూ.

"రాఘవయ్య నీకెంత స్నేహితుడవు గాక—ఓ విషయం మాత్రం చెబుతున్నాను విను. ఓవర్ హెడ్ టేంకుకు అప్పు డప్పుడు కాస్త రిపేరు వస్తున్న మాట నిజమే—దేముడు చేసిన మనుషులకే అన్నన్ని రిపేర్లు కావలసి వస్తుంటే— మనిషి చేసిన యంత్రానికి రిపేర్లురావు టయ్యా?—ఏ రిపేరు అక్కర్లేకపోతే ఈ

## మిథ్యా

రాఘవయ్య అన్నిసార్లు ఆ డాక్టర్లచుట్టూ ఎందుకు తిరుగుతాడు? —సర్లే —అతని గొడవ నాకెందుకు గానీ — నాసంగతి చెబుతా విను.

ఆ వాటాకు ప్రక్కనే నుయ్యి వుంది— ఈ రాఘవయ్య నూతిలో నీళ్లు తీసుకుని ఎరుగని సుకుమారుడేమీ కాదు—చాలాకాలం చిన్న వూళ్లల్లో స్టేషన్ మాస్టరుగా పని చేసిన వాడే— ఈ వేళ ఎక్కడలేని షోకు వచ్చేసింది. అదీగాక, కుళాయి సరిగ్గా వచ్చిందాకా అద్దె ఇవ్వననడానికి ఇతగాడెవరని?— ఒకటోతారీఖుకు అద్దె ఇవ్వకపోతే ఆండాళమ్మను సామాను అవతల పారెయ్యమంటాను. ఈ ముసలాడు ఏంచేస్తాడో చూస్తానేను" —అంది కోపంతో.

పరిస్థితి విషమించ బోతూందని తెలిసి — గడగడ కాఫీని గొంతులోకి పోసుకుని కప్పును టీపాయ్‌మీద పెడుతూ— "అబ్బేబ్బే—ఏదో కోపంమీద అని వుంటారు. —రాఘవయ్య గారు పెద్దమనిషి—అలాంటి వారుకారు—ఆయన సంగతి నేను చూచు కుంటాను కదా—మీరు అనవసరంగా ఆందోళన పడకండి. అయినా—పుట్టిన రోజు పూట ఇలాంటి మాటలు మాట్లాడ కూడదు—" అన్నాను నవ్వుతూ ప్రసంగం మారుద్దామని.

పుట్టినరోజు ప్రస్తావన రాగానే మిథ్యా సుందరి కాస్త మెత్తబడింది—"అదేదో నువ్వే తేల్చు. వ్యవహారం నీకే విడిచి పెడుతున్నాను. అది సరే— ఇప్పుడు నీకేమన్నా ముఖ్యమైన పనులున్నాయా?—" అంది—

మిథ్యా సుందరి మాటలను అర్థం చేసుకోలేని నేను—"అబ్బే ఏమీ లేవే—" అన్నాను—"అయితే—ఇవాళ మనమిద్దరం కలసి సినిమాకు వెళదాం—లీలామహల్‌లో మంచి ఇంగ్లీషు సినిమా వుందట—" అంది మిథ్యా సుందరి.

షాక్ తిన్నట్టు ఫీలయ్యాను నేను— ఆవిడతో సినిమాకు వెళ్లకూడదని నాకేమీ నిబంధన లేదుగాని— బొత్తిగా అంత వయస్సు వున్న ఆవిడను వెంటబెట్టుకుని సినిమాకు వెడితే—కొలీగ్ రీసెర్చిస్కాలర్లు వరయినా చూస్తే వేళాకోళం చేస్తారేమోనని భయం. అలా అని, ఆవిడ మాటను కాదనే ధైర్యం కూడా లేదు నాకు. అందువల్ల ఆవిడకోసం మరింత ఎక్కువచేసి నట్లువుతుంది. ఏం మాట్లాడలేని పరిస్థితిలో మౌనంగా ఆవిడ ననుసరించి సినిమాకు బయలు దేరాను. బొత్తిగా ఐక్యరాజ్యసమితి నయిపోతున్నాను నేను.

* * *

ఇంతవరకూ కథ బాగానే వుంది. అయితే —చిక్కొచ్చిందంటే, ఆరోజున అదే సినిమాకు, అదే ఆటకు, రాఘవయ్యగారనబడే మన కథానాయకుడు కూడా రావడంతో కథ పరాకాష్ఠ కొచ్చింది. ముసలి పెళ్లాం పడుచు మొగుడూ లాగా ప్రక్కప్రక్కన కూర్చున్న మేమిద్దరం రాఘవయ్యగారి కంట బడ్డాం—అదీ మిథ్యాసుందరి ఇప్పించిన కోకోకోలా త్రాగు తూండగా—నాకు కోకోకోలా పులక మారాల్సిందే— ధైర్యం కూడదీసుకుని ఆ పదార్థం కాస్తా త్రాగేసి రాఘవయ్య గారిని చూడనట్టుగా కూర్చున్నాను, ప్రక్కరోజు జరుగబోయే సంఘటనలను ఊహించు కుంటూ —

అనుకున్నట్టుగానే రాఘవయ్య గారికి కోపం వచ్చింది—ఈ విషయం నాకు ప్రక్క రోజున ఆయనింటికి వెళ్లినప్పుడు ఆయన పలక రింపుతోనే అర్థం అయింది— "ఏమయ్యా ఎలా వుంది నిన్న సినిమా -అడగడం నా తెలివి తక్కువగాని నీకు సినిమా ఎలా కనబడుతుంది?— నేతి బీరకాయిలాంటి సుందరి ప్రక్కన



వుండగా..." అంటూ తన అక్కసు నంతటినీ ఒక్కసారిగా మాటల్లో వెళ్లగక్కుతూ అన్నారు రాఘవయ్యగారు.

నిజానికి— రాఘవయ్య గారికి మిధ్యా సుందరి మీద ఎంత కోపం వున్నదో ఆవిడ పేరు మీద కూడా అంత అక్కసు వుంది. "అదేం పేరోయ్— ఎక్కడా వినలేదు— 'మిధ్య'కు సౌందర్యానికి పొత్తు లేదు— మనకు తెలియందాన్నే కదా మిధ్య అంటాం —అలాంటప్పుడు దానికి సౌందర్యం వుందని ఎలా చెప్పగలం?— ఈ పేరు చూస్తే తెలుస్తోంది. ఈవిడ తల్లిదండ్రులకు ఏపాటి తెలివి తేటలున్నాయో—సరే, ఏదో పెట్టారనే అనుకుందాం— ఇంత వృద్ధాప్యం వచ్చిం తర్వాతనయినా ఆపేరును ఈవిడ మార్చుకోవాల్సిన అవసరం వుంది. పేరు చూచి నీలాంటి కుర్రవాళ్లు ఈవిడ ఎంత సౌందర్యవతో అని ఊహించుకుని— తీరా మనిషిని చూచిం తర్వాత అంతా మిధ్యే అని తెలుసుకుని బాధపడే అవకాశం వుంది. తన వయస్సుకు తగ్గట్టుగా ఆవిడ తన పేరును ఏ సుందరమ్మనో, సుబ్బాయమ్మనో, మార్చుకుంటే బాగుండును— ఎందుకీ నేతి బీరకాయ పేరు?—" అంటూ రాఘవయ్యగారు సెటైరికల్‌గాను, సీరియస్‌గాను కూడా మిధ్యా సుందరి పేరు మీద విస్తృతోపన్యాసాలు ఇచ్చిన సందర్భాలు అనేకం వున్నందున— ఈ విషయమై నాకు కావాల్సినంత—'బేక్ గ్రవుండ్'



వుంది. రాఘవయ్యగారి సెటైర్‌ను సులువుగా అర్థం చేసుకుని నవ్వి, వూరుకున్నాను.—లేకుంటే ఏమనాలి?—ధైర్యాన్ని కూడదీసుకుని—"నిన్న మిధ్యా సుందరి పుట్టిన రోజు"—అన్నాను. ఆమాట నేను అనగానే రాఘవయ్యగారి జేబులోంచి చుట్టను తీసి దాన్ని వెలిగిస్తూ, అన్నారు— "నాకు తెలుసు—"

రాఘవయ్యగారు చుట్ట కాలుస్తూ వుంటే నాకు చూడ ముచ్చటగా వుంటుంది. గుప్పుగుప్పు మంటూ ఆయన పొగ వదులుతూవుంటే నాకు రైలింజను జ్ఞాపకం వస్తుంది. నిజానికి—నాకు చుట్ట కాల్చే వాళ్లంటే అసహ్యం. కాని—రాఘవయ్యగారుమాత్రం ఎందుకో ఎక్సెప్షన్.

రాఘవయ్యగారు ఇంకా ఏం మాట్లాడతారో అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాను నేను. ఓక్షణం ఆగి అన్నారాయన—

"మిధ్యా సుందరి తన పుట్టినరోజు పార్టీకి నన్నుకూడా రమ్మని పిలిచింది—"

"అవును నాకు తెలుసు—"అన్నాను.

"తెలుసా?—ఇంకా ఏం తెలుసు?—" అన్నారు రాఘవయ్యగారు ఆత్రంగా నన్ను చూస్తూ.

"ఏమనాలో తెలీక, ఇబ్బంది పడుతూ మరేం లేదు— అంతే తెలుసు—"అన్నాను.

నామాటలు విని నన్ను తీక్షణంగా చూస్తూ అన్నారు రాఘవయ్యగారు—

"నువ్వు తెలిసినా చెప్పవని నాకుతెలుసు గానీ—చూడు మూర్తీ!—నీ స్నేహితురాలికి అంత అహం పనికిరాదు.—కొళాయి బాగు చేయించమంటే, నాకు వినబడేట్టుగా నోటికొచ్చినట్లు మాట్లాడింది. ఇల్లు నచ్చిన వాళ్లే ఉండవచ్చునట— ప్రతిమనిషికీ నచ్చినట్టుగా ఇల్లు రిపేరు చేయించడం సాధ్యం కాదట— అద్దె మాత్రం ఒకటో తారీఖుకు కావాలట—అలా యివ్వక పోతే సామానులు అవతల పారేస్తుందట —నేనేం గాజులు తొడుక్కుని కూర్చో లేదు—ఎలా చేస్తుందో నేను చూస్తాను—" —కోపంతోరాఘవయ్యగారు వణకిపోతున్నారు.

మిధ్యా సుందరి అంత మనిషిని పట్టుకుని రాఘవయ్యగారు అంతలేసి మాటలు అనడం నాకు బొత్తిగా నచ్చలేదు— అలా అని, ఏదో పక్షం తీసుకోవడం మధ్యవర్తి చేయాల్సిన పనికాదు. కనుక, రాఘవయ్య గారికి నచ్చజెబుతూ అన్నాను— "రాఘవయ్య గారూ!—మీరు అనవసరంగా ఆవేశపడవద్దు. మిధ్యా సుందరిని ఏదో లాగ నేను ఒప్పిస్తాను. నెల తిరిగేటప్పటికి ఆ రిపేరేదో పూర్తయేలా చూస్తాను. మీరుమాత్రం గొడవ పడకుండా అద్దె ఇచ్చెయ్యండి—" అన్నాను.

ఏదో అనేశానే గానే అన్న తర్వాత నాలిక్కొరుకు కున్నాను. మిధ్యా సుందరితో చెప్పా చెయ్యకుండా రాఘవయ్య గారికి ఈ వాగ్దానాన్ని ఇచ్చేసి మధ్య నేను మాటపడిపోతానని భయం వేసింది. అయినా, నోరుజారి పోయాను గనుక చేసేదేం లేదని వూరుకున్నాను.

రాఘవయ్యగారు నామాటలకు చాలా విలువ యిచ్చి, నన్ను మిధ్యాసుందరి రాయబారిగా జమకట్టి— "ఊ!—సరే—నువ్వు అన్నావు కాబట్టి ఈనెల అద్దె నీకే ఇస్తాను. నెల తిరిగే లోపున రిపేరు జరక్కపోయిందా అన్నంత పనీ చేస్తాను— రాఘవయ్య అంటే ఎవరో తెలియజెబుతాను—" అన్నారు సీరియస్‌గా—

నాగుండెల్లో రాయి పడింది. అక్కర్లేని గొడవలో తల దూర్చాననుకుంటూ నీరసంగా "ఊ!—" అన్నాను.

(ముగింపు పైవారం)



**మేషం :** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మిథునం :** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. కోర్టు వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కర్కాటకం :** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు:— పుణ్యకార్యాలు చేస్తారు. అలంకార వస్తువులు కొంటారు.

**సింహం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య :** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో పోటీవారి పోట తగ్గుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

# వారఫలం

**28-4-1972 శుక్రవారం మొదలు**
**4-5-1972 గురువారం వరకు**

**తుల :** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం :** ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం :** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. మీ ప్రయత్నాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మీనం :** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోగలరు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు.

—మహేష్






**జరిగిన కథ**

మాధవరావు ఆ ఊళ్ళోకి స్కూలుమాష్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోతే అతను తుక్కాటుకు గురి అయ్యాడు. బామ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆమె తండ్రి అభిప్రాయం ప్రకారం అతను ఆ యింట్లోనే వుండిపోవలసి వచ్చింది. ఆ రోజున తూలుతూ వచ్చాడు మాధవరావు. అతనుకూడా తన తండ్రిలాగా తాగుబోతు అయినందుకు విచారించింది అనురాధ. అతనికి హితబోధ చేసింది. మాధవరావు తప్పు తెలుసుకున్నాడు. ఆతర్వాత అనురాధ అతనికి మరింత చేరువైపోయింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువుకోవడం ఆరంభించింది. మాధవి అనురాధ స్నేహితురాలు. ఆమె అనురాధని ఆట పట్టించింది. అనురాధ పిన్నికి చదువు చెప్పడం ఆరంభించింది.

## 10

రాజా, రవి శ్రద్ధగా చదవసాగారు. నాన్నగారి ఆరోగ్యం చక్కబడింది. ఆయన ప్రాక్టీసు పెరిగింది. కుటుంబ ఆర్థిక పరిస్థితి కొంచెం మెరుగున పడింది. బామ్మకు సుఖశాంతులు లభించాయి. పిన్ని జీవితంలో నవోదయమైంది. ఇక నా జీవితంలో ఏర్పడిన అందమైన మలుపు ఎన్నో శుభాలను కొని తెచ్చింది!

ఇన్ని ఎలా సంభవించాయి — అని అనుకుంటే అతనే కన్నులముందు నిలుస్తాడు. ఇన్ని మార్పులకు అజ్ఞాతంగా కారకుడైన అతను ఎప్పుడూ నిరాడంబరంగా తెర చాటునే ఉండిపోయాడు. అతని నిర్మల హృదయాన్ని జయించుకున్న ఆనందంలో తలమునకలయినా అతని విషాద చరిత్ర తెలుసుకొని అతన్నేవిధంగాను ఓదార్చలేకపోయినందుకు నాకు అసంతృప్తిగానే ఉంది.

కాని, ఒకనాడు తానే చెప్తానని మాట యిచ్చిన వ్యక్తిని ఏమని తరచి అడగను? గత జీవితమెంత విషాద భరితమయినా ఇప్పుడు చిరునవ్వులతో నడయాడే అతన్ని చూస్తుంటే గతాన్ని గుర్తుచేసి మనసు నొప్పించటానికి ఇష్టంలేకపోయింది!

దీపావళి వచ్చింది. ఆనందావళిని కొని తెచ్చింది. అతనెంతో ఖర్చుపెట్టి ఎన్నో టపాసులు తెచ్చి రాజా, రవిచేత కాల్పించాడు.

'ఎందుకింత ఖర్చు...' అని అంటే, '...జీవితంలో ఆనందించే అవకాశాలు అతి తక్కువగా ఉన్నవాళ్ళు సమయం వచ్చినపుడే అనుభవించాలి' అన్నాడు.

అతని మాటల్లోని బరువుకు బాధ కలిగింది. 'మీరలా అంటే నాకు బాగో లేదు. ఒకనాడు నాలోని బాధను పారద్రోలిన మీరు మీలోని వేదనని కొని తెచ్చుకోవటం నాకు కష్టంగా వుంది'

అంతలోనే చటుక్కున నవ్వి, 'పిచ్చి దానా! మాటవరసకు చెప్పానేకాని నేనిప్పుడు బాధపడుతున్నానని అన్నానా? నీ స్నేహంలో బాధలుంటే — అవి తియ్యనివే అవుతాయి రాధా!' అన్నాడు. నాకు నవ్వు వచ్చింది.

'అపురూపమైన నీ నవ్వుల వెలుగులు చూసి దీపాలెలా అసూయ పడుతున్నాయో చూడు...!' అని చక్కగా సంభాషణ మార్చేసాడు.

మనోహరంగా దీపావళి పండుగ గడిచింది. భవిష్యత్తంతా నిత్య దీపావళి కాగలదన్న ఆశతో ఆనందంగా గడిచింది.

శివాలయంలో కార్తీక దీపాలు వెలిగాయి. వీధి అరుగుమీద రోజూ రెండు ప్రమిదల్లో దీపాలు వెలిగించేదాన్ని. రాజా, రవి దీపావళి నాడు మిగుల్చుకుని దాచుకున్న టపాకాయలు కాల్చేశారు.

నాగులచవితి వచ్చింది. సీతామణి వాళ్ళతో కలిసి పుట్టకువెళ్ళి పాలుపోసుకొని వచ్చాము. అప్పుడే మొట్టమొదటిసారిగా పిన్ని ఇల్లు కదలి వచ్చింది.

చలిగాలి తిరిగింది. కార్తీక స్నానాలు చేసేవాళ్ళతో నీలాటిరేవులో ఉషోదయాన్నే సందడి మొదలయింది. చిన్నప్పుడు మధూ, నేనూ పోటీలుపడి పడవలతో దీపాలు ఉంచి నీళ్ళనిత్రోస్తూ నీటిలో ఈదుకుంటూ లోపలికంటా వెళ్ళేవాళ్ళం. ఆ పోటీకోసమే మేమసలు ఈత నేర్చుకున్నది. మా అల్లరిచూసి అంతా అబ్బురపడే వాళ్ళు...అసూయ పడేవాళ్ళు. కాని, వయస్సుతోపాటు కట్టుబాట్లు పెరిగాయి! చిన్ననాటి స్వాతంత్ర్యం తగ్గిపోయింది.

ఒకటి రెండురోజులు సరదాగా రేవుకి వెళ్ళి నేను, పిన్నిదీపాలు వదలివచ్చాము. చిన్ననాటి స్మృతులకు ఎంత మురిసిపోతామో—అంతరాలలో ఆ ఆనందం ఇప్పుడు లేనందుకు అంత బాధగా ఉంటుంది!

ఊరు రూపమే మారిపోయింది. లేనిపోని నాగరికత వచ్చిపడింది. పేరంటానికి వెళ్ళ

తీరికే కొందరికిలేదు: పేరంటానికి పిలిచే స్తోమతు మరి కొందరికిలేదు. పండుగలు, వేడుకలు, ఉత్సవాలు అంతా రాజకీయమయమైపోయాయి. ఊళ్ళో హడావిడి అంతా ఎలక్షన్ను, పదవికోసం పోట్లాటలు...కక్షలు, కుమ్ములాటలు నీళ్లాటి రేవు మొదలు రచ్చబండవరకు, స్కూలుపిల్లలు మొదలు కర్ణంగారివరకు అంతా రాజకీయాల గురించే కబుర్లు, విమర్శలు! ఏ ఒక్కరికీ ఇందులో సంఘీభావము, సదాశయము ఉన్నట్లు కనపడదు. సాత్వికులు చేతకాని వాళ్ళుగాను, నోరున్నవాళ్ళదే రాజ్యముగాను సాగిపోతోంది.

రచ్చబండవద్ద పేకాటాడే తీరికున్న వాళ్ళకు వ్యవసాయం గురించి కానీ, పిల్లల చదువులు గురించి కాని పట్టించుకునే తీరికలేదు. ఆడవాళ్ళకుకూడ ఇంటి పనులకంటే రాజకీయాలతో ముఖ్యమైపోయాయి. ఎన్నికల హడావిడి దగ్గరవుతుంటే కసరత్తు చేసే వాళ్ళకోసం ఇరుపక్షాలవాళ్ళు వేటకు బయలుదేరటం, ఇటువంటి వాటికోసమే కండలుపెంచుకునే మరికొందరు సోమరులు కాచుకొనివుండటం జరుగుతోంది. ఒకరినింకొకరు ఓడించాలని ఖర్చుపెట్టే డబ్బు వెచ్చిస్తే ఊళ్ళోని రోడ్లు, చెరువుకట్ట, వైష్ణవాలయము, బాగుపడివుండేవి! అసూయ, అహంకారం, పదవీవ్యామోహం, విలువునా దహిస్తూ ధనవంతుల్ని..వివేకహీనుల్ని చేస్తున్నాయి. వాళ్ళు రగిలించే జ్వాలలోపడి పేదవాళ్ళు ఆహుతి అవుతున్నారు. రోజులు మారిపోయాయి...అన్నదాని కిదొక్కటే అర్థంగా కనబడుతోంది.

తిరిగి ఎలక్షను ప్రచారం ప్రారంభమయింది. అమాయక ప్రజల్ని ఆకర్షించాలని కామేశం పార్టీవారు కురుక్షేత్రం డ్రామా వేయిస్తే—రంగరాజుపార్టీవారు ఒక సినిమాతారను రప్పించి డన్సుచేయించారు. నల్లధనం వర్షంలా కురిసింది. తప్పతాగి ఊరంతా రెండుపార్టీలవారు గగ్గోలు చేసారు. ఒకళ్ళిద్దరి తలలు పగిలాయి. పోలీసులు వచ్చేసరికి ఊరిరూపం మారిపోయింది. మాంధాతలాంటి రంగరాజుగారు చక్కని విందుచేసి విషయానికి మసిపూసి మారేడుకాయనిచేసి పోలీసువారిని సాగనంపేరు. తలలు పగిలినవాళ్ళు డబ్బులిస్తూ కొని నోరు మూసుకున్నారు. కాలిపోయిన గుడిసెలవాళ్ళకు మరింత హాయిగావుంది. క్రొత్త గుడిశలు కట్టించారు రంగరాజుగారు! రోడ్లమీద మురికిగుంటలలానే ఉన్నాయి. చెరువుకట్ట ఎప్పటిలాగానేవుంది. వైష్ణాలయం కూలిపోతూనేవుంది.

ఆఖరికి ఎలక్షను హడావిడి తగ్గింది. రంగరాజుగారిమాటు తన కొడుకును నిలబెట్టి రంగం నడిపించారు. తిరిగి కామేశంగారోడిపోయారు. ఆ విషయం విన్నప్పటినుంచి నా మనస్సెందుకో వికల



తన్నుకుపోయింది.

ఒకనాడు ప్రేమలేఖ వ్రాసి నన్ను నలుగురిలోను అవమానించిన దురహంకారి ఈనాడు మావూరి ప్రెసిడెంటు అయ్యాడు! దుష్టమంత్రి చేతికి రాజముద్ర నిచ్చిన ప్రజల గతి ఇంకేమవుతుంది ?

'ప్రెసిడెంటుగారు మిమ్మల్నొకమారు రమ్మన్నారండీ!' అని నాన్నగారికి కబురు వచ్చింది. ఆయన అలా వెళ్ళటం నాకు సుతరామూ ఇష్టంలేదు. కాని, ఎందుకని అని అడిగితే ఏమని చెప్పను?

నాన్నగారు తిరిగి వచ్చేవరకు ముళ్ళమీదున్నట్లున్నా, ఆయన ముఖంలోని తేటతనాన్ని చూసి కొంచెం స్థిమితపడి ఏం జరిగిందని అడిగాను.

'ఏముందమ్మా ! అంతా రాజతంత్రం! గ్రామంలో ముఖ్యులైన వాళ్ళని తమవైపు త్రిప్పుకోవటంకోసం తంత్రజ్ఞులు రకరకాల పద్ధతు లవలంబిస్తుంటారు. ఆ మూర్ఖుడిని గెలిపించటానికి నేనెంతో సహాకరించానుట! అందుకు పిలిచి నన్ను సన్మానించబోయారు రంగరాజుగారు. 'నేనందరికీ కావల్సినవాడిని—మీ గొప్పతనాన్ని మీరు చాటుకున్నారు. అంతే తప్ప నాకు విందులు కానుకలు ఎందుకు' అని చెప్పి వచ్చేసాను. ఏమయినా వాళ్ళ చిరునవ్వు నవ్వుతూ ఏదయినా అన్నారంటే ముందెప్పుడో వేయబోయే పంకెళ్ళకు సూచనలన్న మాట ! సరే, ఏం జరుగుతుందో చూద్దాం! తన సృష్టితో, తటస్థులకి, సాత్వికులకు అపకారం జరిగితే భగవంతుడు చేసే మొదటి తప్పు అదే అవుతుంది!' అన్నారు నాన్నగారు.

*　　*　　*

క్రిష్టమసు శలవలిచ్చారు. అతను ఇంటిపట్టునే ఉంటున్నాడు. ఆవేళ బయటకు వెళ్ళినవాడు వస్తూనే, 'డాక్టరుగారూ!' అంటూ కేకవేస్తూ లోపలికి వచ్చాడు. అతని ముఖంలో చిరునవ్వులు చిందులాడుతున్నాయి.

నాన్నగారు బయటకు వచ్చి అతని చేతుల్లోని పేపరు చూసి, 'ఏమిటి? అమ్మాయి ఫలితాలు పడ్డాయాండీ!' అన్నారు ఉత్సాహంతో.

'అవును. హెడ్మాష్టరింటికి వెళ్ళాను.

# రాగధార

అప్పుడే పేపరు వచ్చింది. శిష్యురాలి విజయానికి పార్టీ ఇవ్వమని హెడ్మాష్టరు నా జేబులు ఖాళీ చేయించేసారు' అన్నాడు అతను నా కళ్ళల్లోకి చూస్తూ.

'మనస్సు ఆనందంతో నిండివున్నపుడు జేబులు ఖాళీ అయితేనేంలెండి.' అన్నారు నాన్నగారు. '...మరి క్లాసు వచ్చిందాండీ!'

'అనూరాధకి క్లాసు రాకపోతే ఎవరికి వస్తుందండీ!' అన్నాడు అతను గర్వంగా. పారవశ్యంలో నా మనస్సు నృత్యం చేసింది.

అప్పుడే అక్కడికివచ్చిన బామ్మ ఆ విషయం విని సంతోషంతో పొంగిపోయింది. 'అంతా నీచలవే నాయనా! చిన్నవాడివయినా చేయెత్తి...'

'...తప్పు బామ్మగారూ! మీరు ఆశీర్వదించాలి కాని పొగడకూడదు. మీ పెద్దల ఆశీర్వాదాలే మా చిన్నవాళ్ళకు వెలుగు చూపిస్తాయి. రాధ స్వయంగా తెలివయిన పిల్ల. తను శ్రమపడింది. విజయాన్ని దక్కించుకుంది. ఇందులో నా ప్రతిభేమీ లేదు...'

'నీవంటి వినయభూషణుడు అలాగునే అంటాడు.'

ఇంతలో లోపలినుంచి ధాజా ఏదో కాగితం పట్టుకువచ్చి నాన్నగారికిచ్చాడు. అది చదివి ఉబ్బి తబ్బిబ్బయ్యారు ఆయన. 'మా శాంతి మిమ్మల్నిపూట మా యింటికి విందుకు పిలవమని చెప్పమన్నది రావుగారూ!'



'అంతేకాన్వనా! ఆనందం అప్పుడూపవేసినది. అందినప్పుడే పండుకు తినాలి!'

ఆరాత్రి ఒంటరిగా ఉన్నప్పుడు అతను అడిగాడు. 'మరి నీ గురుదక్షిణ ఏది రాధా!'

'మీరేదికోరితే ఇవ్వను! మీరే అడగండి...' అన్నాను చిరునవ్వుతో—

'నిన్నడిగి తీసుకునేటంతటి చిన్నది నేను కోరను రాధా!'

'మీరడగకుండానే నాదనేది అంతా మీకివ్వటానికి సిద్ధంగా ఉన్నాను మాస్టారూ!' నా గొంతులో ఏదో తెలియని ఆవేశం పొంగింది. అంత ధైర్యం ఎలా వచ్చిందో మరి!

'నాకు తెలుసు అనూ!.. నీకు తెలియకుండానే ఆ కానుకని నాకెప్పుడో అందజేసావు. అందుకొని ఆనందిస్తున్నాను.'

అప్పుడతని కళ్ళల్లో మెరిసే కాంతికి చకితనయ్యాను. ముంచుకువచ్చిన ఉద్వేగంతో ఒక్కడుగు ముందుకువేసాను. 'మీరలా చూడకండి మాస్టారూ! నేను తట్టుకోలేకపోతున్నాను.'

అతను నా భుజాలు పట్టుకొని చిన్నగా నవ్వుతూ, 'నేనిప్పుడు మాస్టార్ని కాదు రాధా! నిన్ను 'అనూ' అని పిలవగలిగిన మాధవుడిని' అన్నాడు.

నా హృదయతంత్రులు మధురంగా శ్రుతిచేసుకున్నాయి. విలువెల్లా మత్తు లాంటిదేదో ఆవరించుకుంది. నా కళ్ళు తేలిపోయాయి. స్పృహ తప్పినట్లయింది. నాకేమయిందో తెలియదు. ఆ స్థితిలో అతని బలమైన చేతులు నన్ను ఎత్తుకొనిపోతున్నట్లు గుర్తించగలిగాను. అంతే! ఎంతసేపు అలా ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్నానో మరి! కొంతసేపటికి కళ్ళు తెరిచేసరికి నేను మంచంపై పడుకొనివున్నాను. అతను ప్రక్కనే కూర్చుని నా ముఖంలోకి తదేకంగా చూస్తున్నాడు.

నా చూపులు తగిలి అతని ముఖంలో దరహాసం మెరిసింది. నా శరీరంలో ప్రవహించిన విద్యుచ్ఛక్తి ఛాయలింకా అలానే ఉన్నాయి. ఆరునెలలనాడు ఒకసారి ఇలాంటి అనుభూతినే పొందాను. ఆనాడింకా నేను పసిహృదయంతో ఉన్నాను. ఆవేళ దేవునిలా కనిపించిన వ్యక్తి అన్నింటికీ తానే సార్థికారిగా పిలిచాడు !

# అతనంటే నాకు ప్రాణం. అతన్తో ఎట్లా చెప్పేది?

నెల రోజుల క్రితం. ఇల్లాదిది. ఆసీనులై ఆ వచే, రమేష్ ఇంటికి వెళ్లటం ముంభేనే రాధకు మధురంగా ఉండేది. ఇప్పుడు, అతని నోటి దుర్వాసన వల్ల, అతనికి దగ్గర్లో ఉండటమే సహించ లేక పోతోంది.






తరువాత, ఒక రోజున రాధ స్నేహితురాలు, కుసుమ కాలక్షేపం కోసమని వచ్చింది.










నెల తరువాత—




అమెకు తప్పకుండా తెలుసు బినాకా గ్రీన్ వారిని ఒకరినొకరికి అత్యంత సన్నిహితులుగా చేసింది

హాయిలాంటి అనుభూతితో, మెత్త్రా లాంటి అనుభవంలో అలానే ఉండిపోవాలని కోరుకుంటోంది మనస్సు. అతని చూపుల్లోంచి తెలిపూల వెన్నెల కురుస్తోంది. హృదయంలోని అనురాగం పట్టుతేనెతో గొంతుని నింపినట్లు పొంగింది.

గబుక్కున అతడు ముందుకు వొంగి నా నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు. అతని చేతి(వేళ్ళ కదలికలు నా ముంగుర్లలో విద్యుచ్ఛక్తిని పుట్టిస్తున్నాయి. ఆ ప్రవాహం ఒళ్ళంతా (ప్రవహించి సర్వస్వాన్ని సుత్తెక్కిస్తోంది!

తట్టుకోలేని నేను ఆతనిచేతుల్ని పెనవైచుకొని కళ్ళు మూసుకున్నాను.

'ఉద్వేగానికి తట్టుకోలేని పసిదానివి నీవు అనూ!' అతని మాటలు చెవిదగ్గరగా వినిపించాయి.

కళ్ళు మూసుకునే అన్నాను నేను 'అందుకనే మీరు నాకు కావాలి.'

(ప్రతిజీవితంలోను అతి (ప్రియమైన వస్తువు దొరికినప్పుడు ఎక్కడలేని ధైర్యం వస్తుంది కాబోలు! అది రాత్రివేళని, ఆ సమయంలో అతనితో అంతసేపు ఆగదిలో ఒంటరిగా అటువంటి స్థితిలో ఉన్నానని. తెలుసుకునే స్థితిలోలేను. ఏది జరగనీ— అన్నిటికీ నేను సిద్ధమే— అని అనిపించే ధైర్యసాహసాలు ఆడపిల్ల జీవితంలో కూడ ఒక్కొక్కసారి ఏర్పడతాయని ఆ నాడు

# రాగధార

స్వానుభవమయింది నాకు!

* * *

(క్రిష్మమస్ వెళ్ళిపోయింది, భాగా చలిగా ఉంటోంది. (పొద్దున్నే కొంచెం ఆలస్యంగా లేవాలనిపిస్తుంది. కాని వీణాసాధనకోసం లేవక తప్పదు. కొంచెంసేపు బద్ధకిస్తే చాలు బామ్మకాని, పిన్నికాని లేపేస్తారు.

ఉషఃకాంతిలో బయట (ప్రకృతిని చూస్తూ వీణాగానం చేస్తుంటే అనిర్వచనీయమైన ఆనందంతో ఒడలు పులకరిస్తుంది. మంచుతెరను చీల్చుకొని వచిన్చ అరుణకిరణాలు పచ్చికమీద హిమబిందువులలో పంచరంగుల్ని (ప్రతిఫలింపజేస్తున్నాయి.

ని(ద్రితమైన (ప్రకృతి పులకరించే క్షణంలో లోకమంతా కళ్ళు చేసుకొని చూడగలిగితే ఎంత బాగుంటుందని! గొబ్బిపాటలు వినిపిస్తున్నాయి. బంతులు, చామంతులు లోకమంతా మురిపిస్తూ నాట్యమాడుతున్నాయి. సాతానిజియ్యరు హరినామ స్మరణ వినిపిస్తోంది.

వేణుగోపాల్ వెళ్ళి మూడు నెలలు దాటింది. ఇంతవరకు అతని నుండి మళ్ళీ రెండో ఉత్తరం లేదు. బామ్మకి ఆపరేషన్ గురించి (వ్రాస్తాడని ఎదురు చూస్తూ వచ్చాను. మరెందుచేతనో అతను (వ్రాయలేదు.

జనవరి ఒకటవ తేదీ వచ్చింది. ఉదయాన్నే అతను నూతనవర్ష శుభాకాంక్షలందించాడు. నేను (ప్రతిగా ఒక పూల గుత్తిని అందించాను. అతను నా కళ్ళల్లోకి చూస్తూ ఆ గుత్తిని తన పెదవులకి అద్దుకున్నాడు. సిగ్గుల మొగ్గలు విడిపోకుండా లోపలికి పారిపోయాను.

మరునాడు అతను పిలిచి ఒక పెద్ద కవరు అందించాడు. నా ముఖంలోని (ప్రశ్న చూసి, 'విప్పి చూడు రాధా!' అని నవ్వాడు అతను.

విప్పి చూసాను. 'రాధ మాధవులకు— వేణు' అని వేణుగోపాల్ పంపిన (గ్రీటింగ్సు. రాసలీలా వినోదంలో తన్మయులై ఉన్న రాధా మాధవుల చిత్రం అది. భావం (గ్రహించిన మనస్సు పరవశించింది. తనువు పులకలెత్తింది.

నేను కనురెప్ప లెత్తి అతని వైపు చూసేసరికి అతను మురిపెంగా నవ్వుతున్నాడు.

'ఒకే చిత్రాన్ని ఇద్దరికి పంపితే ఎలా ?' అన్నాను మనస్సులో కొంటెభావం రేకెత్తగా.

'ఇద్దరూ ఇద్దరుగా కారని...'

'నాకు తెలుసులెండి.'

'నీకు తెలుసునని నాకు తెలుసుగా!'

ఇద్దరం నవ్వుకున్నాము.

మాటల సందర్భంలో వేణుగోపాల్ ఎక్కడికో వైద్య సహాయానికి వాలంటీరుగా వెళ్ళాడని — అందువల్లనే ఇంతవరకు బామ్మను తీసుకరమ్మని నాన్నగారికి (వ్రాయలేదని అతను చెప్పాడు. 'బహుశా ఒక నెల రోజుల తర్వాత అతను తిరిగి రావచ్చు!'

సం(క్రాంతి పండుగ వచ్చింది. భోగినాడు వీధులలో మండించిన కొయ్యదుంగలనుంచి ఇంకా పొగ లేస్తూనే ఉంది. ఆనాడుకూడ పండగ భోజనం చేయమని అతనికి నాన్నగారు చెప్పారు.

'భోగిపండుగ విందు ఇక్కడ అయింది కదా! మరేమనుకోకండి. ఈవేళ తప్పకుండ వాళ్ళింటికి రమ్మని బలవంతం చేసారు హెడ్మాష్టరు' అన్నాడతను.

నాన్నగారేమనలేకపోయారు. మధ్యాహ్నం విందు అయినాక అతని వెంట హెడ్మాష్టరు కూడ రావటం చూసి నేను ఆశ్చర్యపోయాను. నాన్నగారు ఆహ్వానించి కూర్చొ






# హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరిస్తుంది.

మీరు అజీర్ణంతో బాధపడుతున్నారా! కడుపునొప్పి సన్నగా వున్నదా? అందువల్ల అసౌకర్యంగా వుంటుంది. ఏకాగ్రత లోపిస్తుంది. అకారణంగా కోపం వస్తుంది.

వెంటనే హ్యూలెట్స్ మిక్స్చర్ తీసుకోండి. అది చాలా త్వరగా, శక్తివంతంగా పనిచేసి కడుపునొప్పిని తొలగిస్తుంది.

అది కడుపులోపల — రక్షణ కవచంవంటి ఒక పొరను కల్పిస్తుంది. ఆమ్లపదార్థాలని నిర్మూలించి, ఆహారం సులభంగా జీర్ణమవడానికి తోడ్పడుతుంది. హ్యూలెట్స్ మిక్స్చర్ పిల్లల జీర్ణకోశ వ్యాధులకు కూడా చాలా మంచిది.

విరేచనాలని అరికట్టడానికి హ్యూలెట్స్ మిక్స్చర్ (నల్లనిమూత) వాడండి

సి. జె. హ్యూలెట్ అండ్ సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
150-A/2, మౌంటు రోడ్డు, మద్రాసు-2

CJH-6091

## రాగధార

పెట్టారు. వాళ్లేదో కబుర్లలో పడ్డారు. కొంతసేపు అయ్యాక నేనే పళ్ళాలలో పండగ పిండివంటలు పెట్టి తీసుకువెళ్ళాను.

'అబ్బెబ్బే! ఇప్పుడేకదమ్మా భోజనాలు చేసి వచ్చాము...' అని ఏదో అనబోయారు హెడ్మాష్టారు.

'పెద్ద బరువైనవేమీ కాదు మాష్టారూ! రుచి చూడండి...మా తృప్తికోసం' అన్నారు నాన్నగారు.

'పండుగనాడు పదుగురికి పిండివంటలు రుచి చూపిస్తే నిత్యమూ విందు చేసుకో వచ్చు మాష్టారూ! అందుకని...' అన్నాను నవ్వుతూ.

'తెలివైన పిల్ల!'అన్నారు హెడ్మాష్టారు అతనితో. 'మరి మీ శిష్యురాలికి నేను వచ్చినవిషయంచెప్పండి...' అన్నారుఅయన.

'ఎంత తెలివైన పిల్లయినా పెద్దలంటే గౌరవం కలది. డాక్టరుగారికి మీరు చెప్పండి ఫర్వాలేదు.' వారి మాటలర్థంకాక నాన్న గారు, నేను ముఖా ముఖాలు చూసు కున్నాము.

'ముందు ఫలహారం కానివ్వండి. మీరేది చెప్పినా వినడానికి నేను సిద్ధమే' అన్నారు నాన్నగారు.

'మరేంలేదు డాక్టరుగారూ! రిపబ్లిక్‌డేకి మా స్కూల్లో ఉత్సవాలు జరుపుతున్నాము. మీ అమ్మాయి వీణ కచేరీ చేస్తే రక్తి కడు తుందని మా కోరిక. మీరు కాదనరన్న ఆశతో వచ్చాను.'

నా గుండెలు దడ దడ లాడాయి. అతని వైపు పిచ్చిగా చూసాను. అతను చిరునవ్వు తోనే ఏదో ధైర్యం చెప్పాడు. నాన్నగారి వైపు ఆత్రుతగా చూసాను. 'ఆమెకింకా అంత అనుభవం లేదు. పైగా కచేరీకి కొంచెం పక్కవాయిద్యాల వాళ్ళుండాలి.'

'మీకా శ్రమ ఎందుకు? పక్కవాయిద్యాల వాళ్ళ నిక్కడికి రేపే తెప్పిస్తాము. రెండు రోజులు వాళ్ళతో రిహార్సలు వేస్తే చాలు. ఇక మీ అమ్మాయికి అనుభవంలేదని మీరంటే అది మీ నిరాడంబరతను చాటు తుందే తప్ప నిజాన్ని దాచలేదు...'

ఆయన పొగడ్తతో నాకు సిగ్గు ముంచు కొచ్చి కాఫీ తెచ్చే వంకతో లోపలికి వెళ్లాను. నేను తిరిగి వచ్చేసరికి వాళ్ళ సంభాషణలకి ఒక రూపం వచ్చినట్టుంది.

నన్ను చూస్తూనే హెడ్మాష్టారు అన్నారు. 'మీ అనుమతి లభించింది. ఇక సార్మల్‌గా మీ అమ్మాయి ఇష్టాన్ని తెలుసు కుంటే మాకు తృప్తిగా ఉంటుంది...'

నాన్నగారు నా వైపు తిరిగి, 'అమ్మడూ! మరి విషయం విన్నావుగా! నీ అభిప్రాయం మాష్టారికి చెప్పమ్మా!' అన్నారు.

'మీ ఇష్టం నా యిష్టం కాదా నాన్నా!' అన్నాను.

'తండ్రికి తగిన కూతురు లక్ష్మి నిమించిఉ దనిపించుకుంటుంది. నీకు దైవం అయు రారోగ్యైశ్వర్యాలు చేకూర్చుతాడమ్మా!...' అన్నారు హెడ్మాష్టారు.

'మీ పెద్దల ఆశీర్వాదం దైవ వాక్కు వంటిది మాష్టారూ!...'

తెలియని ఉద్వేగంతో గబుక్కున పైకి లేచిన హెడ్మాష్టారు నా తల నిమురుతూ అలా క్షణంపాటు నిలబడిపోయారు. ఆయన కళ్ళల్లో నిలచిన అశ్రువులు నన్ను చకితు రాల్ని చేసాయి.

'నేను వస్తాను డాక్టరుగారూ! శలవు.' అని ఆయన చటుక్కున వెళ్ళిపోయారు.

నేను తెల్లబోతూనే, 'ఆయనలా అయి పోయారెందుకు నాన్నా!' అన్నాను.

'ఆయనదొక విషాద చరిత్రమ్మా! నీ అంత కూతురు ఉండేది. వీణ చక్కగా వాయించేదట. ఎన్నో కచేరీలలో వీణాగానం చేసి మంచిపేరు తెచ్చుకుంది అంద చందాలుగల పిల్ల కూడా! ఒక యువకుడు ఆమెను చూసి ముక్కువ పడ్డాడు. చదువు కున్నవాడు, ధనవంతుడు, మంచివాడు అయినవాడికి తన పిల్లనివ్వడానికి ఎవరు సందేహిస్తారు! ఆ పిల్లకూడ ఒప్పుకుంది. పెళ్ళి జరిగింది. ఒక ఆరు నెలలు వాళ్ళు సంసారం అనుభవించారేమో! పాపం, అతను కారు ప్రమాదంలో చనిపోయాడు...'

'అయ్యో!...' అన్నాను అప్రయత్నంగా.

'ఆ పిల్ల మనస్సు దెబ్బతింది. మతి పోయింది. ఎన్నివిధాల ప్రయత్నించినా ఎన్ని వైద్యాలు చేయించినా ఆమె పిచ్చి కుదర లేదు. ఆఖరికి చిక్కి శల్యమై రెండేళ్ళ క్రితం ఆమె హఠాత్తుగా చనిపోయింది. ఇదమ్మా ఆయన విషాద చరిత్ర!' అన్నారు నాన్నగారు బాధగా నిట్టూరుస్తూ.

(ఇంకా ఉంది)

# నొసలు చిట్లించి నోరు నవ్వితే?





కె. రామలక్ష్మి

ఇళ్ళకి వ్యక్తిత్వం వుంటుందంటే నమ్ముతారా? నే పిచ్చిదాన్ని అనుకుంటారా? ఖాళీ యింట్లో అడుగెట్టినా—ఆ యింటితత్వం మనకి అవగాహన అయిపోతుంది.

'ఈ యింట్లో వాళ్ళు ఆనందంగా ఉండి ఉంటారు' అనిపిస్తుంది. 'ఈ కొంపలో కీచులాడుకు చస్తుంటార'నిపిస్తుంది. 'నీకు మరీ పిచ్చి యింటి నొసలు చిట్లిస్తూనూ, నవ్వుతూనూ కనిపిస్తుందేవిటి నీకు?' అంటారు పిల్లలు. కాని నిజంగా పరిశీలించి చూడండి—అలాగే కన్పిస్తుంది.

కొందరిళ్ళు చూడండి. అందమైన కిటికీలుంటాయి. వాటి కడ్డంగా ఏ డ్రెస్సింగ్ టేబిలో, ఏ బీరువానో పెట్టేస్తారు. ఆ పెట్టేవి— కొంచెం పక్కకి పెట్టి కిటికీ అందం చెడకుండా చూడ్డం కష్టంకాదు. కొత్తగా కట్టుకున్న యిళ్ళకి గోడల్లేవు, అన్నీ కిటికీలే. అన్ని కిటికీలెందుకు? వాటికంతంత తెరబట్టలెందుకు? అందమైన యింటిని కనపడనీయకుండా దాచేయడం దేనికి? కిటికీలగుండా కనబడనివి లోపలకి పెట్టుకోకూడదా? పక్కింటి వాళ్ళు తొంగి చూస్తారని మా పక్కవాళ్ళు పక్క కిటికీ రెక్కలు తెరుచుకోరు! ఫాషన్ పేరిట శుభ్రమైన దీపాలు పెట్టుకోరు. ఇల్లంటూ వుంటే చూసేవారు దాన్ని చూసి ఆకర్షితులవ్వాలి. వారికి రావాలనిపించాలేగాని, "ఈ కొంప గొంగళిడేరాలా వుంది బాబూ" అనిపిస్తే ఎలా?

కొద్దో గొప్పో—యిప్పుడు స్వంత యిళ్ళు—ఫ్లాట్లుకూడా ఎక్కువ అవుతున్నాయి. ఏదో శత్రుకూటాన్నించి రక్షణనిచ్చే ఒంటిస్థంభపు మేడలా— దేనికదిగా—పక్కవారితో అస్సలు సంబంధం లేకుండా వుండాలని—తాపత్రయపడతారు. ఒకరితో ఒకరు బాత్ రూములూ, కుళాయిలూ పంచుకోవలసి రాకుండా కట్టుకోవచ్చు—కాని— ఒకరికి ఒకరు కనబడకుండా ఎందుకో అర్థం కాదు. అరుగుమీద నిలబడి ఒచ్చేపోయే వాళ్ళని చూడగల్గడం, కిటికీలోంచి పక్కింటి పిన్నిగారితో మాట్లాడగల్గడం — యివన్నీ బాగావుంటాయి. కాని ఆధునికులకి నచ్చవు.

నిజానికీనాడు గొప్ప గొప్ప వాళ్ళు కట్టించుకుంటున్న అత్యాధునికమైన ఇళ్ళే —ఏమాత్రం మనలో కుతూహలం రేపనివి —ఓ ప్రాణంవున్న కొంపల్లాగా అవి తోచవు. సినిమా సెట్లో భవంతుల్లా వుంటాయి. ఖాళీగా గంభీరంగా వుంటాయి. యిక మధ్య తరగతి కొంపలు—అగ్గిపెట్టెలు పేర్చినట్టు—ఆటల్లో అట్టయిళ్ళలాగా వుంటున్నాయి. మన ఇంజనీర్లు, నిర్మాణదార్లూ యీ కళాత్మక విషయాల జోలికి పోరు— ఇంటికి ముఖ్యం అదెంత కాంక్రీటులో కట్టినా ప్రాణం.

కొత్తవూళ్ళో రోడ్డువెంట నడుస్తూ అక్కడి మనుషుల తత్వాలని గ్రహించవచ్చు. ఎందుకంటారా? యిళ్ళు కొత్తవైతే— మనుషులూ కొత్తగా, ఒకరితో ఒకరు సంబంధంలేనట్టుగా—కాళీ కాంపౌండులతో, గమ్మత్తుగా ఉంటాయి. అవి పాతబడి అక్కడి మనుషులలో ఆత్మీయత పెరిగి— యిరుగుపొరుగు అన్న సంబంధం ఏర్పడితే తప్పించి— ఆ కొత యిళ్ళకి — వ్యక్తిత్వం ఏర్పడదు.

నా స్నేహితురాలొకామె — ఎన్నోసార్లు ప్రపంచం అంతా చుట్టివచ్చిన వయస్సు పండినామె—అంటూ వుంటుంది— 'నీ వీధి తలుపు మూసేసినంత మాత్రాన నువ్వు ప్రపంచాన్ని బయటకి నెట్టావనుకోవచ్చు. కాని బయటినుంచి ప్రపంచం నిన్ను చూస్తూనే ఉంటుంది' అని. ఎంత నిజం. అందుకే ఎవరిళ్ళైనా సరే—మూసి వున్నా తెరచివున్నా — ఆహ్లాదం కల్గించేదిగా ఉండాలి. అందుకే వాకిట నవ్వుతూ వల్కరిస్తూ చిన్న ముగ్గు! పిలిచిన వారిని వల్కరించడానికి తెరిచిన కిటికీ !! ●

## చకోరి

ఆ. వె. చక్కనైన సంధ్య సాయంబుగా వచ్చి
పిల్లవాయు వొచ్చి పిలవకుండ
తెల్లనైన మంచి మల్లెలు విరిసెను
నీవురావు నాడు నేరమేమి.

ఆ. వె. ఆకసంబునందు అందాల తారలు
నీదురాక కేమొ నిక్కిచూచె
ఎన్నొమార్లు చూసి ఎందు కానగరావు
నీవురావు నాడు నేర మేమి.

ఆ. వె. విరిసె నన్ను జాజి విరులెన్నో శుభసూచ
కంబు కోర్కె తీరగాంతునేమొ
అనియు ఆశ కలిగె అలసిపోతిని చూచి
నీవురావు నాడు నేరమేమి.

ఆ. వె. అల్లురాలననుచు అలసత్వమును చూసి
నన్ను చూతువేల చిన్న చూపు
సన్నుతింతునోయి నిన్ను వినుతి సేతు.
నీవు రావు నాడు నేరమేమి.

ఆ. వె. తెల్లవార వచ్చె తెలియక నాస్వామి
నిన్ను తూలనాడి నింద చేసి
నేటి రేయినైన నిన్ను చూతును రమ్మి
నిన్ను నమ్మి నేను నిలచియుంటి.

—కొచ్చర్లకోట కామేశ్వరి

# కాటేసిన పగ



యర్రంశెట్టి శాయి

వేకువ ఝామున నాలుగయింది.

చీకట్లు కొంచెం కొంచెంగా పల్చబడుతున్నాయి. చల్లనిగాలి ఆ చీకట్లోకి జొరబడుతోంది.

చిన్న పల్లెటూరది.

రెండొందలిళ్ళు ఉంటాయేమో! ఇళ్ళన్నీ ముసుగులో నిద్రపోతున్నట్లు ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉన్నాయి. ఉన్నట్టుండి ఎక్కడో కోడి తెల్లారబోతూందని ఓ హెచ్చరిస్తోంది.

వూరి చివరగా శిధిలావస్థలో ఉన్న పెంకుటింట్లోంచి లాంతరు గుడ్డివెలుగు బయటకుపడి ఆ ప్రదేశంలోని చీకటిని తరిమేయడానికి శాయశక్తులా పోరాడుతోంది. ఇంటిచుట్టూ బాగా ఎదిగిపోయిన చెట్లు కొద్ది గాలికి కూడా విపరీతమయిన సవ్వడిచేస్తూ దయ్యాల్లా తలలూపుతున్నాయి. పెంకుటింటికి అటూ ఇటూ ఉన్న అరుగులు శుభ్రంగా అలికి ఉన్నాయి. వాటి మీద ముగ్గులు ఆ చీకట్లో కూడా తెల్లగా కనిపిస్తూనే ఉన్నాయి. అరుగుమీద ఒక పాత కుర్చీలో మాధవరావు కూర్చుని చీకట్లోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. లేవకుండానే కుర్చీ వెనుక ఉన్న కిటికీ అం

చులు తడిమి అగ్గిపెట్టె అందుకొన్నాడు. చుట్ట వెలిగిస్తోండగా లోపల్నుంచి దమయంతి గొంతు వినిపించింది.

"మాధవయ్యా! త్వరగా రా!"

అతను ఒక్క ఉదుటున లేచి లోపలికు నడిచాడు. చుట్ట అతనిచేతిలోనుంచి జారి అరుగుమీదే నిప్పులు క్రక్కుతూ పడి పోయింది. లోపల లాంతరు వెలుగులో వో స్త్రీ నాకొని ఉంది. వార్ధక్యరేఖలు ప్రవేశిస్తున్న ఆమెముఖంలో ఖంగారు నిండుకుంది.

"ఏమయింది దమయంతీ!"

# కాటేసిన పగ

"రాధమ్మ పలకటం లేదు!"

బయట ఎక్కడో వో కుక్క భయంకరంగా మొరిగింది. ఇంటిముందు రావి చెట్టు పెద్దగా సవ్వడి చేసింది. లాంతరు వత్తి మీద వెలుగు ఒకటి రెండుసార్లు రెపరెప కొట్టుకొని మళ్ళీ మామూలుగా వెలగసాగింది. మాధవరావు తలుపులులేని దరవాజాలోనుంచి ప్రక్కగదిలోకి నడిచాడు. ఆ గదికొంచెం వెచ్చగా ఉంది. రెక్కలులేని కిటికీకి గోనెసంచి అడ్డంగా ఉంది. మరో ప్రక్క గోడకానుకొని వాల్చి ఉన్న మంచం మీద వో స్త్రీ నిశ్చలంగా పడుకొని ఉంది. గదిలో కోడిగుడ్డు దీపం గుడ్డివెలుగు విరజిమ్ముతోంది. ఆమె మంచం దగ్గరకు నడిచి ఆమె ముఖంలోకి వంగి చూశాడతను. నిద్రపోతున్నట్లు కళ్ళు మూసుకొని ఉంది.

"రాధా" మెల్లగా పిలిచాడతను, ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొని. దమయంతి గదిలో కొచ్చి అతనివెనుకే నుంచుని ఆత్రుతగా చూడసాగింది. మరికొంచెం గట్టిగా 'రాధా' అంటూ ఆమెను తట్టి పిలిచాడతను. ఆమె పలకలేదు.

"మనలో లేదనుకుంటాను!" అంది దమయంతి. మాధవయ్య ఉలిక్కిపడి వెనక్కుతిరిగి ఆమెవంక చూశాడు.

"ఇప్పుడెలా మరి?" అతని గొంతు వణికింది. కళ్ళు రెపరెపలాడినయి.

"డాక్టర్ బాబుని పిల్చుకు రావాలి!"

"ఇప్పుడా?"

"లేకపోతే ఎలా? ఆ మనిషి ప్రమాద స్థితిలో ఉంది."

"ముందు స్పృహలోకి వచ్చేట్లు చేయాలి!' అన్నాడతను.

"నేను మునసబు గారింటి దగ్గరకువెళ్ళి జీబ్లేదాకు తీసుకొస్తాను. నువ్వు చూస్తూండు!" అన్నాడతనుపై పంచరమీద వేసుకొంటూ.

"నువ్వు వెళ్తావా?" అందామె అనాలోచితంగా

"అవును! ఎంతలోకి? పావుగంటలో రానూ!" అతను చెప్పులు వేసుకొని మెట్లు దిగుతూండగా ఆమె వెనుకేవచ్చింది

"మాధవయ్యా!" అంది ఖంగారుగా. "నేనే వెళ్ళి తీసుకొస్తాను! నువ్విక్కడే ఉండు!"

"చీకట్లో ఒక్కర్తెవీ వెళ్తావా?"

"ఫరవాలేదు. తెల్లారిపోతూనే ఉందో పక్క! భయమేముంది?"

చీకట్లో కలిసిపోయిందామె.

మాధవరావు చెప్పులు విడిచేసి తిరిగి లోపలికెళ్ళాడు. నులకమంచం పట్టెమీద కూర్చుని ఆమెముఖంలోకి చూశాడు. ప్రశాంతంగా ఉంది. అతను భరించలేకపోయాడు. ఏదో విపరీతమయిన భయం అతనిని ఆవహించింది. మనసంతా ఆందోళనతో నిండిపోయింది. కళ్ళవెంబడి నీళ్ళు జలజలారాలినయి. ఆమె శిరస్సుని లేవనెత్తి తన వళ్ళో ఉంచుకొని చిన్నపిల్లాడిలా విలపించసాగాడతను. పావుగంట గడిచిపోయింది. ఆమెలో కొద్దిగా కదలిక కనిపించింది. ఆనందంగా ఆమెవంకే చూశాడతను. కొద్ది క్షణాలకి మెల్లగా కళ్ళు విప్పింది. నవ్వడానికి ప్రయత్నించింది. గానీ, నీరసం ఆ నవ్వుని పెదాలమీదకు రాకుండానే అంతం చేసింది.

"రాధా! ఏం కావాలి?" అడిగాడతను.

"మం...చి...నీళ్ళు...."

అతను లేవకుండానే క్రిందచెంబులో ఉన్న నీళ్ళు గ్లాసులోకి వంచి ఆమెనోటి దగ్గరుంచి కొంచెంకొంచెంగా త్రాగించాడు.

కోల్పోయిన ధైర్యమంతా కూడగట్టుకొంటున్నాడు.

సన్నగా చీపురు పుల్లల్లా తయారయిన ఆమె చేతుల్ని ఆప్యాయంగా నిమిరాడు.

"ఏమండీ?"

"ఏం కావాలి రాధా!"

"నేను ... బ్రతుకుతానని.....నమ్మకం లేదు...."

ఉక్కిరిబిక్కిరయ్యాడు మాధవయ్య.

"ఛఛ్ఛ రాధా! అలా మాట్లాడకు! వారం రోజుల్లో లేచి తిరుగుతావన్నాడు డాక్టరు!"

"నా సంగతి నాకు బాగా ...తెలుసు.... నేను బ్రతకను!"

అతను బెంబేలు పడిపోయాడు.

"నన్ను... ఎంతో ప్రేమగా చూసుకొన్నారు..... ఏ లోటూ రానీకుండా చూశారు...కానీ...." శక్తినంతా కూడదీసుకొంటూ అనదామె.

"నువ్వు మాట్లాడకు రాధా! నిన్ను బతికించుకొంటాను!" అతని కన్నీళ్ళు ఆమె చెక్కిళ్ళమీద టపటప రాలినయి.

"మిమ్మల్ని..... మోసం..... ద్రోహం చేశాను....." ఏడ్చేసిందామె.

"రాధా! రాధా!" ఆమె రెండుచేతులూ గట్టిగా పట్టుకొంటూ అన్నాడతను.

"ఏమండీ! నన్ను క్షమిస్తానంటారా?"

"ఎందుకు రాధా! నువ్వేం తప్పు చేశావని?"

"మీ దగ్గర నిజం దాచాను. రెండేళ్ళ మంచి కడుపులో దాచుకొన్నాను. మోసం





# ఏటేటా వచ్చే దురద

## దానికి నివారణ ఏమిటి?



చెమటకాయలతో దురద, దురదని ఎంతో చికాకు పడతారు. గోకుతే చర్మము పొరలు లేచి అసహ్యముగా ఉంటుంది. జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు మరియు ప్రిక్లీ హీట్ పౌడరు ఎండ వేడితో చెమట కాయలు రాకుండా త్వరగా రక్షణ కలిగిస్తాయి అవి రెండూ చెమటకాయలనుండి రక్షణ నివ్వటమే నేడు లభిస్తున్న తయారీలలో ఎంతో పొదుపైనవి

మొదట, ఔషధములు చేరిన జాన్సన్స్



ప్రిక్లీ హీట్ సబ్బుతో స్నానము చేయండి. అది వాచిన చర్మ రంధ్రములకు ఉపశమనము కలిగించి, అంటురోగములను సోకనీయదు.

తరువాత, చెమ్మను పీల్చి చర్మమునకు హాయిని కలిగించే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరును ఒంటిమీద జల్లుకోండి. దానిలో చెమటకాయలనుండి రక్షణనిచ్చే ఒక ప్రత్యేకమైన అంటిసెప్టిక్ పదార్థముంది. దానితో వెంటనే గుణము కనిపిస్తుంది. చెమటకాయల బాధనుండి తప్పించుకొనే పద్ధతి యిదే.




# జాన్సన్స్*

## ప్రిక్లీ హీట్ పౌడరు మరియు సబ్బు




జాన్సన్ అండ్ జాన్సన్ లిమిటెడ్ *ట్రేడ్ మార్క్

## కాటేసిన పగ

చేస్తున్నానన్న దిగులు— అదే ఈ స్థితికి తెచ్చింది నన్ను....."

"ఇప్పుడేమీ చెప్పొద్దు. విశ్రాంతి తీసుకో ముందు!" మందలింపుగా అన్నాడు.

"దయచేసి వినండి. మీకు చెప్పకపోతే నాకు శాంతిలేదు.... మీరు నన్ను రెండేళ్ళ క్రితం పాపయ్య బండిలో మా వూరు పంపించారు గుర్తుందా? ...."

మాధవయ్యను గతం అందుకొంది.

జీవితం మూడుపువ్వులు, ఆరుకాయలుగా ఉన్న రోజుల్లో — దమయంతి ద్వారా తను ఆనందాన్ని కొనుక్కొంటున్నాడన్న సంగతి రాధకు తెలిసింది. రాధ ఏడవలేదు. బాధపడలేదు. హృదయపూర్వకంగా నవ్వింది.

"మిమ్మల్ని నేను ఆనంద పరచలేక పోతున్నాను. అందుచేత మీరు మంరోత్రోవ వెతుకుతున్నారు. ఇందులో మీ తప్పేమీ లేదు!" అన్న దేవత.

ఆరోజు నుంచే తన జీవితం మలుపు తిరిగింది. స్త్రీలోలత్వం దూరమయింది. ప్రేమ, కామం ఒకటనే భావం సమసిపోయి, వాటిమధ్య ఉండే తారతమ్యం గోచరించింది. రాధంటే ప్రేమ—తన్ప్రేమను కొంటూ వచ్చిందంతా కామం— అప్పటి నుంచీ రాధ జీవిత సర్వస్వం అయింది.

"ఇంటికెళ్ళాలి. అమ్మను చూడాలనుందన్న" రాధ కోర్కెను అందుకే అంత త్వరగా అంగీకరించలేకపోయాడు. చివరకు తప్పలేదు. పాపయ్య బండి ఏర్పాటుచేసి తోడుగా దమయంతిని పంపించేడు. తెల్లారుఝామున నక్షత్రాల వెలుగులలో అందమయిన రాధ ముఖాన్ని ఆకలిగా చుంబించి వీడ్కోలిచ్చాడు. ముప్ఫయ్ మైళ్ళ దూరం— బస్సులూ— రైళ్ళూ చేరలేని స్థలం— కేవలం పాపయ్య బండి ఆధారం.

"ఆ రోజు.... ఆ రోజు...." ఆయాసంగా భయంగా చెప్పసాగింది రాధ.

* * *

నల్లని చీకటి. కీచు పురుగులు, ఇలకోళ్ళు భయంకరంగా నిశ్శబ్దాన్ని భంగం చేస్తున్నాయి. ఎద్దు మెడలో మువ్వలు మ్రోగుతున్న శబ్దం—గంగ్రడఇసుకని కోసుకొంటూ నడుస్తున్న బండి చక్రాలశబ్దం—కొరిచెం గురడెదిటువు కలిగిస్తున్నాయి. దట్టంగా అల్లుకుపోయిన చీకటిలో బండికి కట్టిన దీపం మిణుకు మిణుకుమంటూ వెలుగుతూ వూగుతోంది. ఉండుండి చలిగాలి వేగంగా తాకుతూ పోతోంది.

"బాగా చలివేస్తోంది!" అంది దమయంతి. రాధ చిన్నగా నవ్వింది.

ప్రయాణం సాగించి గంటవుతోంది. టైము చూసుకొందామె. అయిదయింది. ఇంకో రెండుగంటలు పడుతుంది ఇల్లు చేరుకొనేసరికి. పెళ్ళయింతర్వాత మొదటిసారిది వంటరిగా ఇంటికి వెళ్ళటం. అదివరకు రెండు పండుగలకు వెళ్ళినప్పుడు ఆయన కూడా వచ్చారు.

నవ్వు వచ్చింది రాధకి.

ఆయనలాంటి వారని వూహించనయినా లేదు. పెళ్ళయిన క్రొత్తలో చాలారోజుల వరకూ తెలీలేదు. తెలీకుండా జాగ్రత్తపడేవారు. రాత్రిళ్ళు ఆలస్యంగా వచ్చినా, ఒకో రోజు రాకపోయినా అనుమానం కలుగకుండా ఏదో సాకు చెప్పేవారు.

"దమయంతి సాలా సెడ్డమనిసండీ!" అంటూన్న పనిపిల్ల దుర్గమాటలు తన కర్థం కాలేదు. కాని ఆ 'చెడు'కి దుర్గ కూడా బలయి పోయిం తర్వాత తనకి భయంతో వణుకుపుట్టుకొచ్చింది.

"అన్నెయం అయిపోనాదమ్మా! బాబుగారు నన్నాయం సేశారు. ఇదా దమయంతి ముండపని. భగవంతుడు అన్నీ సూస్తాడు. వోరూ బాగుపడరు!"

తనకి మొదట అర్థంకాలేదు. అర్థమయిం తర్వాత జ్వరం వచ్చినట్లయింది. ఆయన అంత నీచమయిన పని చేస్తారా?

"దుర్గ చెప్పింది నిజమేనా?"

తృళ్లిపడ్డారాయన.

బండి ఆగిపోయింది. రాధ బయటకు చూసింది. అటూఇటూ ఏవో తోటలు— అడవిలా ఉందా ప్రవేశం చీకట్లో. పాపయ్య దిగి ఎద్దుని అదిలించినా, అది ముందుకి కదల్లేదు. లాంతరు చిమ్నీ ఎత్తి అతను బీడీ అంటించుకొంటుంటే అది కాస్తా ఆరిపోయింది. పూర్తి చీకటి. చెట్లమీదనుంచి రెండు పిట్టలు భీకరంగా అరుచుకొంటూ ఎగిరినయి. రాధకు భయం వేసింది.ముందూ వెనుకా కానరావి ఆస్థితిలో పాపయ్య




# ఉతికే బిళ్ల
# డెటర్జెంట్ శక్తితో నిండినది
















**డెట్** డెటర్జెంట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 50%
ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా ఉతుకుతుంది
—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లతో

Shilpi HPMA-45/70 Tl

రెక్కలు విరిచి కట్టేసేరెవరో. దమయంతిని క్రిందకు లాగేరు. అదే చెయ్యి రాధకోసం వెతికింది. ప్రాణాలరచేతిలో ఉంచుకొని శక్తికొద్దీ అరచింది రాధ. ఆ అరుపు తోటలు దాటిపోలేదు. ఆ ఆకారం చేతిలో నిస్సహాయంగా పెనుగులాడిందామె. దమయంతి ప్రక్కనే నుంచుని చూస్తోనే ఉంది. పాపయ్య కేకలు వేస్తున్నాడు. ఆ చీకట్లో— ఆ తోటల్లో— రాధకు కళంకం అంటింది. ప్రాణంపోతే బావుండుననుకొన్న రాధ ప్రాణం పోలేదు. తెల్లని వెల్తురు చూడ్డానికి మొఖం చెల్లలేదు. సూర్యకిరణాలకి ఎప్పటిలా స్వాగతం పలికే అర్హతపోగొట్టుకుంది. బ్రతు

# కాటేసిన పగ

కంతా నల్లని చీకటి అంటుకొంది.

"ఎంతపని జరిగిందమ్మా!" దమయంతి ఓదార్పు—

"పదండమ్మా! దుర్మార్గులు నాశనమయిపోతారు!" అంటోన్న పాపయ్య గొంతూ—ఉపశాంతి కలిగించలేదు. నిజాలుగ కనిపించలేదు. వెనుక ఏదో కుట్రమోసం—అన్యాయం నిలచి ఉన్నాయని అనుమానం. కేవలం తనకోసమే వెదికినట్లున్న ఆ హస్తానికి తన ప్రయాణం సంగతి ఎలా తెలుసు? బండిలో నిశ్చలంగా, కనురెప్పలు వాల్చకుండా శూన్యంలోకి చూస్తున్న రాధ మనసులో ఆలోచనలు అల్లుకొంటున్నయి. బండదగ్గర తనను లాగుతున్నప్పుడు ఆ ఆకారం "దమయంతీ!" అని పిలచిన గుర్తు. ఇల్లు చేరుకొన్న రాధకు శరీరం మనసూ వేరయినట్లనిపించింది. తిరిగివెళ్లిపోయేముందు దమయంతి దగ్గరకొచ్చి రహస్యంగా అంది.

"అయిందేదో అయిపోయింది. ఎవరికీ ఈ సంగతి తెలియనీకమ్మా! పండంటి సంసారం పాడయిపోతుంది!"

ఆమె కళ్లల్లోకి నిశ్చలంగా చూసిన రాధకు ఆమెలో ఏదో క్రూరత్వం—ఎదురుగా గోచరించినయి.

"నిజంచెప్పు! అతనెవరు? అతనికి నీ పేరెలా తెలుసు? మన ప్రయాణం సంగతెలా తెలుసు?"

దమయంతి వెనక్కు తగ్గింది. ఆమె గొంతు మారింది.

"అవును! మీరనుమానిస్తున్నది నిజమే! మాధవయ్య నా కన్యాయం చేశాడు. నేను చేస్తున్న పనిని అలుసుగా తీసుకొని నా కూతుర్ని కాటేశాడు. అందుకని నా పగ తీర్చుకొన్నాను. ఆయన స్నేహితుడు శోభనాద్రికి మీ మీద ఆశ కలిగించాను. అవకాశం చూపించేను!"

రాధ నిశ్చేష్టురాలయి నిలబడిపోయింది. దమయంతి వెళ్లిపోయింది.

* * *

"ఇప్పుడు.... నాకు.... మనశ్శాంతిగా."

మాట్లాడలేక పోతోంది రాధ. మాధవయ్య బొమ్మలా నుంచుండిపోయాడు. బయట ఏవో మాటలు వినిపించినయి.

"ఇంత ప్రొద్దున్నే జిల్లేడు పొదలదగ్గర కెందుకెళ్లిందో ముండ. బహుశా ఎవరికోసమో వెళ్ళుంటుంది!"

"దేముడు పాము రూపంతో వచ్చి మనూరికి శని తొలగించాడు!"

మాధవయ్య ఒక్క ఉదుటున బయటికొచ్చాడు. అప్పటికే వాళ్లు దూరమయిపోయారు.

"రాధా!.... రాధా!.... దమయంతిని పాము కరచిం...."

తెల్లారుతుండగా మాధవయ్య బిగ్గరగా ఏడవటం చుట్టుపక్కల వాళ్లకు వినిపించింది. ●

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## తండ్రి ఆత్మశాంతికి కుమారుని బలి యిచ్చిన క్రూరాత్ముడు

శరీరం భయంతో ముడుచుకు పోయే సంఘటనొకటి గురుదాస్‌పూర్ జిల్లా దీనానగర్‌లో జరిగింది. చరిత్రకందని క్రూరాత్ముడొకడు తన కొడుకును తండ్రి ఆత్మశాంతికి బలియిచ్చాడట. ప్రకాష్‌చంద్ అనే ఆయన, ఆయన తమ్ముడు పరక్‌దాస్, చెల్లెళ్ళు మాయ, కౌసల్య— యీ నలుగురు చేరి బలిదానం ఏర్పాటు చేశారట. 15 ఏళ్ళ క్రితం చనిపోయిన తన తండ్రి ఆత్మశాంతికి తన ముగ్గురు కొడుకులనూ బలియివ్వ నిశ్చయించుకున్నాడట ప్రకాశ్‌చంద్. అతని ముగ్గురు కొడుకులలో ఒకడు జరగబోయే దారుణాన్ని పసిగట్టి తప్పించుకు పారిపోయాడట. సైన్‌దాస్ అనే వో చుట్టం ఇంకో కొడుకును యీ గండం నుంచి తప్పించి, సురక్షిత ప్రదేశానికి చేర్చి ఆనక విషయాన్ని పోలీసులకు తెలియజేశాడట. 30వ తేదీ రాత్రంతా భజనలతోనూ, ప్రార్థనలతోనూ గడిపి, ఆదివారం పుదయం ఇక బలియివ్వచ్చని తీర్మానించుకున్నారట. ఈ బలి చుట్టాలందరి సమక్షంలోనే జరిగిందట. ప్రకాష్‌చందూ, కొందరు బంధువులూ కలిసి ప్రకాష్‌చంద్ కుమారుడు ప్రీతమ్‌ను గట్టిగా పట్టుకున్నారట. మరో బంధువు గండ్ర గొడ్డలితో ప్రీతమ్‌ని నరికేశాడట. పోలీసులు వచ్చే సరికే యీ నరబలి జరిగిపోయిందట. నేరుగా యీ హోమాన్ని చూసిన స్త్రీలు మూర్ఛబడిపోయారట. కొందరు భయంతో ఏడుస్తూ పారిపోయారట. పూర్తి బలిఅయ్యాక తన బిడ్డ తిరిగి బ్రతుకుతాడని ప్రకాష్‌చంద్ర అన్నాడట—

## సైకిల్ ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయిన యువకుడు

కృష్ణగిరి వరాట్టణపల్లి చెందిన 20 ఏళ్ళ శ్రీనివాసన్ అనే యువకుడు సైకిలుమీద 'బరుగూరు' వెళ్ళి, సినిమా చూసి తిరిగొస్తుండగా కుప్పం ఆవేక్షురు ప్రాంతంలో వో సైకిలు వేగంగా ఎదురొచ్చి అతన్ని ఢీకొన్నదట. దాంతో శ్రీనివాసన్ క్రిందపడ్డాడట. అతని తలపగిలి, నెత్తురు వరదలుగాకారి, అతను సేలం ఆసుపత్రిలో చేర్చాక చనిపోయాడట. సైకిలుమీద ఎదురొచ్చి ఢీకొన్న 35 ఏళ్ళ మునియప్పమీద హత్యానేరం బనాయించి, అరెస్టు చేసిందట పోలీసు.

## కేరళ మంత్రి హఠాన్మరణం

కేరళ ఆర్థికమంత్రి కే.టి.జార్జి అనే ఆయన 3వ తేదీ మధ్యాహ్నం 12—30 గంటలకు ఎసెంబ్లీలో పన్నుల విషయం మాటాడుతూ గమ్మున బల్ల మీదికి ఒరిగిపోయినారట. ఏవో కాగితాలు చూస్తుంటున్నారని గాబోలనుకున్న మిగతా వారికాయన వాలకం అనుమానం వేసి, గమ్మున లేచివెళ్ళి, ఆయనను పట్టుకున్నారట. అప్పటికే ఆయన మేను తిరిగిపోతున్నారట. చూస్తుండగానే ఊపిరితిత్తులు, గుండె పని చేయడం మానేశాయట. ఆరోగ్యశాఖ మంత్రియైన డాక్టర్ ఆదివేలు వెంటనే కార్డియాక్ మసాజ్ చేశారట. హృదయం తిరిగి పని ప్రారంభించినా, ఊపిరితిత్తులు పని ప్రారంభించలేదట. ఆ రాత్రి ఆయన చనిపోయారట.

## చెల్లెలిని హత్యచేసి అన్న ఆత్మహత్యా ప్రయత్నం

కడలాడి అనే గ్రామంలో 25 ఏళ్ళ గోపాలశెట్టి అనే అతని చెల్లెలు కాంచన తన ఎదురింటి వారబ్బాయిని ప్రేమించిందట. ఈ విషయం గ్రహించి గోపాలశెట్టి శతవిధాల నచ్చచెప్పి చూశాడట. అది కుదరక పోయేసరికి, సరేలే ఆ కుర్రాడినే పెళ్ళి చేసుకుందువుగాని అని మాటిచ్చి, ఆమెను తండరాంపట్టు అనే ఊరికి తీసుకు వెళ్ళి, 6వ తేదీన ఆ ఊరి నుంచి వేలూరు వచ్చి ఆ రాత్రి వేలూరులో వుండి, మర్నాడిక్కడికా కాట్పాడి చేరారట. అక్కడ నుంచి ఆమెను ఆ వూరి చివరకు తీసుకు వెళ్ళి, అక్కడామెకు విషంతో తయారు చేసిన రొట్టె యిచ్చి తినమన్నాడట. ఆమె అనుమానపడి తిననుపొమ్మనేసరికి, వో బండరాయితో ఆమె తల పగలకొట్టి, ఆంతతో ఆగక, ఆమె మీద పెట్రోలు పోసి అంటించి, తాను వెళ్ళి నూతిలో దూకాడట. చుట్టుపక్కల వాళ్ళు యీ మంటలకూ కేకలకూ పరుగున వచ్చి, గోపాలశెట్టిని నూతి లోంచి తీసి బ్రతికించారట. పోలీసు అతని మీద హత్య, ఆత్మహత్య ప్రయత్నం అనే కేసులు బనాయించారట.

## అడవి మనిషికి వెంటనే అబ్బిన విద్య!

స్పెయిను అలికాన్టికు చెందిన కొందరు రోమన్ కాథలిక్ నన్స్ మొన్న ఆరవ తేదీన వో అడవి మనిషిని పట్టుకున్నారట. ఆతనికి సుమారు యాభైయ్యేళ్ళు వున్నాయట. కాలివేళ్ళు, చేతి వేళ్ళు భయంకరంగా పెరిగి వున్నాయట. జుట్టూ, గడ్డం అంతకన్నా భయంకరంగా పెరిగి వున్నాయట. ఈ వింత మనిషి చేష్టలకు మృగంలా వున్నాడట. మాటా రాదట. మంతీ రాదట. బహుశా యితని తల్లిదండ్రులితన్ని మాటలు కూడా రాని చిన్న వయస్సులో అడవులలో వదిలి వేసి వుంటారని అభిప్రాయ పడ్డారుట. ఆతన్ని చూసినవాళ్ళు నానా కష్టాలూ పడి ఆతనికి వారు నాగరికపు అలవాట్లు, తినడం చూపించితే, చేపల్లాలా, ఫోర్క్‌లతో అవి గిరాటేసి, పళ్ళెంలో వున్నదంతా కబళించేశాడట. రాత్రి ఇంట్లో పడక కుదరక, బయటికి వెళ్ళి చెట్టుమీదెక్కి పడుకున్నాడట. ఎటొచ్చీ సిగరెట్టు కాల్చటం ఒక్కసారి చూపించగానే ఆవిద్య చక్కగా వచ్చిందట. ప్యాకెట్లు ప్యాకెట్లు ఊదేస్తున్నాడట.

## గోదావరి నదిలో వైద్యవిద్యార్థిని శవం

కొవ్వూరు వద్ద గోదావరి నదిలో విపరీతంగా కుళ్ళిపోయిన వో స్త్రీ శవం దొరికిందట. దర్యాప్తు వల్ల ఆమె పేరు కె. ధనలక్ష్మి అని, వాల్తేరులో ఎం.బి.బి.యస్. చదువుతోందని తెలిసిందట. ఈమె వాల్తేరులో ప్లసరు పెట్టెలో ఎక్కినపుడు ఆమెకు ఇచ్చిన 5వ నెంబరు బెర్తులో ఎవరో విద్యార్థులు కూర్చుని ఆబెర్తు ఆమెకు వదలడానికి నిరాకరించారని, దానిపైన ఆతరువాత టికెట్టు కలెక్టరు ఆమెకు మరో బెర్తు యిచ్చారనీ కూడా తెలిసింది. ఆమెను ఆఖరిసారిగా తెల్లవారు ఝామున 4—30 కు తాను చూశానని, అప్పుడు రైలు సామర్లకోట చేరుతున్నదని, కంపార్ట్‌మెంటు కండక్టరు చెప్పాడట. ఈ విషయంలో దర్యాప్తు తీవ్రంగా జరుగుతున్నదని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నరసింహారావు అన్నారట.





# సినిమా

## కుటుంబ నియంత్రణ పురాణం!

అది ఒక చిన్న గ్రామం. అక్కడ తిరణాల జరుగుతూ వుంది. ఆ తిరణాల సందర్భంగా అభ్యుదయ సంచార నాటక సమితివారు 'సుభద్రార్జునీయం' నాటకాన్ని ప్రదర్శించారు. కుటుంబనియంత్రణావశ్యకతను యీ నాటకం ద్వారా తెలియచేసారు. నాటకం రక్తి కట్టింది. ప్రేక్షకులు అర్జునుడివద్ద ఆటోగ్రాఫ్‌లు తీసుకున్నారు. అల్లంతదూరాన, తన కారువద్ద నిలబడి యున్న ఒక అందాల అతివను అర్జున పాత్రధారి చూశాడు. ఆమెను సమీపించాడు.

సుందరం: మీరూ ఆటోగ్రాఫ్ కోసమేనా?

ఇందిర: మీకో సలహా యిచ్చిపోదామని...

సుంద: ఏమిటో అది?

ఇంది: చూడండి. పద్యాలు పాడడం చేత కానప్పుడు యిలాంటి నాటకాలెయ్యటం దేనికి చెప్పండి.

సుంద : ఒక్కొక్కళ్ల అందమనండి, ఆకర్షణ అనండి, అప్పుడప్పుడు తబ్బిబ్బు చేస్తుంది అందుకే యివాళ కొంచెం దెబ్బతిన్నాను—అంటూ ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

ఇంది: మీ సంతాన నిరోధ ప్రచారానికి పురాణాలే దొరికాయా ?

సుంద: నరనరాల్లో జీర్ణించుకుపోయిన రామాయణ భారతాల ద్వారా ప్రచారంచేస్తేనే వాళ్ళకి బాగాఅర్థమవుతుంది'—అని ఇందిరకు నచ్చ చెప్పాడు, సుందరం. 'కట్' అన్నారు దర్శకుడు వి. రామచంద్రరావు. ఈ సన్నివేశం డి. బి. ఎస్. ప్రొడక్షన్స్ వారి 'అబ్బాయిగారు—అమ్మాయిగారు' చిత్రంలో కనిపిస్తుంది. ఇందిరగా వాణిశ్రీ సుందరంగా కృష్ణ నటిస్తున్నారు. డి. బి నారాయణ నిర్మించే యీ చిత్రం శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.



'మేనకోడలు'లో జమున, కృష్ణ.

## శ్రీకృష్ణాంజనేయ యుద్ధం

శ్రీరామచంద్రుని పాదారవింద సేవయే తన జీవిత పరమావధిగా గొన్న ఆంజనేయుడు విధి వలయంలో చిక్కుకుని, విచారగ్రస్తుడయ్యాడు. తన స్వామి దర్శనం కోసం నిరీక్షించాడు.

ఆంజనేయుడు: రామచంద్రా! రఘుకులేంద్రా! నీ నిరుపమాన కరుణా కటాక్షమునకై, అనుక్షణమూ పరితపించుచున్నానే; నిరంతరము తారకరామ మంత్రాక్షరీమత్త చిత్తుడనై త్వదీయ దర్శనాపేక్షతో తపించుచున్నానే, ఈ దాసానుదాసునిపై నీ దయ రాదా? నాకు నీ దర్శనమే కాదా ?

ప్రభూ, నీవేల రావు. ఈ దుర్గమ గంధ మాదన పర్వత శిఖరాగ్ర సంచారముచే నీ సుందర సుకుమార పాదార విందములు కందిపోవుననియా! నేనేమి పాపము చేసితినని నీ సేవకు దూరము చేసి నన్ను చిరంజీవిగా నిలబెట్టితివి రామా! నా పాపమునకు పరిహారం ఎన్నటికి? నాకు విమోచనమే లేదా? నీ దర్శన భాగ్యం కలగదా? రామా, రామా...రామా, అంటూ హనుమంతుడు నిలపిస్తాడు. 'కట్' అన్నారు దర్శకుడు సి. ఎస్. రావ్. ఈ దృశ్యం పూర్ణిమా పిక్చర్స్‌వారి 'శ్రీకృష్ణాంజనేయయుద్ధం' లో కనిపిస్తుంది. ఆంజనేయుడిగా రాజనాల, శ్రీరామచంద్రమూర్తిగా ఎన్టీ రామారావు నటిస్తున్నారు. డి. ఎన్. రాజు నిర్మిస్తున్న యీ పౌరాణిక చిత్రరాజము తారకరామా పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.

## డి. వి. ఎస్. కొత్త చిత్రం

మంచి చిత్రాలను నిర్మించే కొద్ది సంస్థల్లో డి. వి. ఎస్. ఒకటి. గతయేడది విడుదలయిన 'చిన్ననాటి స్నేహితులు' కూడా ప్రజాదరణ నందుకున్న విషయం మీకు తెలుసు. మంచి కథకోసం రెండు సంవత్స

లాలు ఆగిన డి. వి. ఎస్. రాజుగారి ఓపికను మెచ్చుకోవాలి. ఇప్పుడు కొత్త చిత్రం ప్రారంభం కాబోతూంది. ఈ చిత్రానికి జి. బాలసుబ్రమణ్యం కథను యిచ్చారు. సముద్రాల మాటలను వ్రాస్తున్నారు. ఎన్టీ రామారావు నాయకుడు. ఏ.సి. త్రిలోక్ చందర్ దర్శకుడు.

## తాతయ్యగా ఎస్వీఆర్
## మనవడిగా రాజబాబు

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'తాత—మనవడు' చిత్రంలో తాతయ్యగా ఎస్వీ రంగారావు, మనవడిగా రాజబాబు నటిస్తారు. కథ, మాటలు, సినిమా అనుకరణవరకే గాక దర్శకత్వాన్ని కూడా చేపట్టారు దాసరి నారాయణరావు. ఈ చిత్రానికి రమేష్‌నాయుడు సంగీతాన్ని, వాలి కళను నిర్వహిస్తారు. కె. రాఘవ నిర్మించే యీ చిత్రంలో కొందరు కొత్తవాళ్లు కనిపించే అవకాశాలున్నాయి. మేలో పాటల రికార్డింగు జరుగుతుంది.

## హంతకులు—దేవాంతకులు

ఎస్. ఆర్. కంబైన్స్ నిర్మిస్తున్న క్రయిమ్ థ్రిల్లర్‌కి 'హంతకులు—దేవాంతకులు' అన్న పేరును ఖాయం చేసారు. క్రైం చిత్రాలలో ఒక వినూత్న పంథాను తొక్కి, విశిష్ట ప్రమాణాలతో, నిర్మించబడిందట యీ చిత్రం. ఈ చిత్రంలో జ్యోతిలక్ష్మి—కృష్ణ నాయకీనాయకులు. దర్శకుడు: కె. ఎస్. ఆర్. దాస్. అన్ని పూర్ణా విడుదల.

## నాగేష్ పాత్ర!

పై చిత్రంలో 'జెరీ లూయిస్ ఆఫ్ ది సౌత్' గా పరిగణింపబడుతున్న నాగేష్ ఒక ముఖ్యపాత్రను ధరించి, తన చిలిపి చేష్టలతో, హుషారయిన నటనతో ప్రేక్షకుల్ని గిలిగింతలు పెట్టారట. క్రయిమ్ చిత్రాలంటే జలపాతాలవద్ద భయంకర పోరాటాలు, కొండల నడుమ క్లయిమాక్స్ దృశ్యాలు వుంటాయని ప్రజలకు బాగా తెలుసు. ఈ చిత్రంలోని కథ ఆద్యంతం సస్పెన్స్‌తో నడుస్తుందట. ఈ చిత్రాన్ని సుబ్బరాజు, ఎం. కె. రాధ నిర్మించారు.

'హంతకులు—దేవాంతకులు' చిత్రానికి విజయబాపినీడు కథను, దాసరి నారాయణరావు మాటలను, సత్యం సంగీతాన్ని, కన్నప్ప ఛాయను నిర్వహించారు. ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, త్యాగరాజు, ముక్కామల, జి. వి. జి, సత్తిబాబు, గోకిన రామారావు, పోషించారు. హిందీ నటి షబ్నం ఒక ప్రముఖ పాత్రను ధరించింది

## వీనస్ కంబైన్స్
## రెండవ షెడ్యూలు

వీనస్ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్ చిత్రాన్ని గత మాసంలో ప్రారంభించి, ఒక షెడ్యూలును పూర్తిచేసారని పాఠకులకు తెలిపాను. రెండవ షెడ్యూలు ఏప్రిల్ 8 నుండి 12 వరకు విజయా—వీనస్ స్టుడియోల్లో జరిగింది.

అక్కినేని నాగేశ్వరరావు—నర్తకి హాలం పాల్గొని అభినయించిన ఒక పాటను (విక్టరీ) వి. మధుసూదనరావు చిత్రీకరించారు. ఈ చిత్రం నాలుగురీళ్లు తయారైంది.

పై చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచయిత. కె. వి. మహదేవన్ సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయను, ఎస్ కృష్ణారావు కళను, సత్యం కూర్పును నిర్వహిస్తున్నారు. నాయకుడు: నాగేశ్వరరావు. నాయికలు: వాణిశ్రీ—కాంచన. హాస్యజంట: రాజబాబు—రమాప్రభ, పాపగా బేబీ సుమతి నటిస్తూంది. నిర్మాత: టి. గోవిందరాజన్. సహ నిర్మాత: టి. వి. ఎస్ శాస్త్రి: విడుదల: నవయుగ.

## బడిపంతులు మొదటి
## షెడ్యూలు పూర్తయింది

ఏప్రిల్ 3 న ప్రారంభమైన 'బడిపంతులు' షూటింగు 16 తో పూర్తయింది. మొదటి షెడ్యూలులో 6 రీళ్ల చిత్రం వచ్చింది. త్రివేణి ప్రొడక్షన్స్



'హంతకులు—దేవాంతకులు'లో రాజసులోచన, కృష్ణంరాజు.

# సినిమా డైరీ

● సినీకంబైన్స్‌వారి రెండవ షెడ్యూలు ఏప్రిల్ 8 నుండి 12 వరకు విజయాలో జరిగింది. నాగేశ్వరరావు, 'హలం' పాల్గొన్నారు. వి. మధుసూదనరావు దర్శకుడు.

● త్రివేణి ప్రొడక్షన్స్‌వారి— 'బడిపంతులు' మొదటి షెడ్యూలు ఏప్రిల్ 3 నుండి 16 వరకు వాహినిలో జరిగింది. ఎన్టీరామారావు, జగ్గయ్య, నాగభూషణం, అంజలీదేవి, జయంతి విజయలలిత, రామకృష్ణ, కృష్ణంరాజు, రాజబాబు పాల్గొన్నారు. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

● డి. బి. ఎస్. ప్రొడక్షన్స్ 'అబ్బాయిగారు— అమ్మాయిగారు' చిత్రానికి ఏప్రిల్ 8 వ ఆరుద్ర వ్రాసిన పాటను, మహదేవన్ సారథ్యంలో ఎస్. పి. బి. విజయాగార్డెన్స్‌లో పాడారు. వి. రామచంద్రరావు దర్శకుడు.

● భరణీ పిక్చర్స్‌వారి 'అంతా మనమంచికే' ఏప్రిల్ 19 వ నవయుగ ద్వారా విడుదలవుతుంది. శ్రీమతి భానుమతి దర్శకత్వం వహించారు.

● జగపతి ఆర్ట్స్ పిక్చర్స్‌వారి 'బంగారు బాబు' షూటింగు ఏప్రిల్ 12, 13 తేదీల్లో మహాబలిపురం సమీపాన జరిగింది. అక్కినేని, నాగభూషణం, వాణిశ్రీ, రాజబాబు, రమాప్రభ పాల్గొన్నారు వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు.

మాధవీ ఆర్ట్స్ పిక్చర్స్‌వారి 'వంశోద్ధారకుడు' ఏప్రిల్ 21 వ లక్ష్మి ద్వారా విడుదల అవుతుంది. పి. సాంబశివరావు దర్శకుడు



'శ్రీకృష్ణవిజయం' యుద్ధంలో వాణిశ్రీ, కాంతారావు.



నిర్మిస్తున్న యీ సముజ్వల సాంఘికంలో ఎన్టీరామారావు అసాధారణ ప్రజ్ఞను చూపెడుతున్నారట. చాల కాలం తర్వాత అంజలీదేవికి భర్తగా ఎన్టీఆర్ నటిస్తున్నారు. ఒకప్పుడు వీళ్లిద్దరూ నటించిన చిత్రాలకు విపరీతమైన వసూళ్లు వుండేవి.

'బడిపంతులు' చిత్రానికి డి. వి. నరస రాజు సంభాషణలను, ఆచార్య ఆత్రేయ పాటలను వ్రాసారు. ఛాయను వి. ఎస్. ఆర్. స్వామి చేపట్టారు. ముఖ్యభూమికలను జయంతి, విజయలలిత, పద్మిని, సూర్యకాంతం, రామకృష్ణ, కృష్ణంరాజు, రాజబాబు, అల్లురామలింగయ్య, రావికొండలరావు, సాక్షిరంగారావు మరియు నాగభూషణం ధరిస్తున్నారు. పి. పేర్రాజు నిర్మించే ఈ చిత్రానికి పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు. పూర్ణా విడుదల.

## అంతా మన మంచికే

భరణీ పిక్చర్స్ నిర్మించిన 'అంతా మన మంచికే' ఏప్రిల్ 19 న నవయుగద్వారా విడుదలవుతుంది. అసాధారణ ప్రజ్ఞావంతురాలు, అనన్య ప్రతిభాసంపన్నురాలు అయిన భానుమతి ఈ చిత్రంలో ప్రేక్షకులను తన నటనతో, మృదుమధురగానంతో, దర్శకత్వ ప్రతిభతో ఆకట్టుకుంటారు. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం భానుమతి నిర్వహించారు. మాటలను డి.వి. నరసరాజు వ్రాసారు.

ముఖ్యపాత్రలను భానుమతి, నాగభూషణం, కృష్ణ, పద్మిని, కృష్ణంరాజు, పద్మనాభం, నాగయ్య, ధూళిపాళ, మిక్కిలినేని, సూర్యకాంతం, ఛాయాదేవి, సుమ, బుష్యేంద్రమణి, మాలతి, మోహన పోషించారు. 'అంతా మన మంచికే' చిత్రం సంచలనాన్ని కలిగించడం తథ్యం, అంటున్నారు పరిశ్రమలోని వారు.

## మేనకోడలు

రవిశంకర్ పిక్చర్స్ నిర్మిస్తున్న 'మేన కోడలు' షూటింగు పూర్తయింది. ఏప్రిల్ 10, 11 తేదుల్లో మద్రాసులోని విదేశీ ఛాయబారి గృహంలో జమున, కృష్ణ



'డబ్బుకు లోకం దాసోహం' (ఎన్టీ ఆర్) నాయకునితో, నిర్మాత జగన్నాథరావు, దర్శకుడు యోగానంద్.

పాల్గొన్న పాటను బి. వీస్. నారాయణ చిత్రీకరించారు.

ఏప్రిల్ 12 నుండి 19 వరకు విక్రం స్టూడియోలో క్లయిమాక్స్ మరికొన్ని ముఖ్య సన్నివేశాల చిత్రీకరణ జరగడంతో, షూటింగు దశ పూర్తయింది. చిత్రం నిడివి 15 వేల అడుగులకు మించకుండా వుంటుంది, అని నిర్మాత సుసేల్ చెప్పారు.

'మేనకోడలు' కథను మాదిరెడ్డి సులో

## సినిమా

చన వ్రాసారు. మాటలను దాసరి నారాయణరావు, సంగీతాన్ని ఘంటసాల, ఛాయను రాంచౌదరి నిర్వహించారు. ముఖ్యపాత్రలను జమున, సూర్యకాంతం, రేణుక, కృష్ణ, గుమ్మడి, రాజబాబు, రావు గోపాలరావు, బేబీ శ్రీదేవి, మాష్టర్ గాంధీ పోషించారు. అనిల్ ప్రభాస్ద్వారా సవయుగ విడుదల.

'మేనకోడలు' విడుదల అయ్యేదినాన మరొక చిత్రానికి అంకురార్పణ జరగుతుందని, నిర్మాత సుసీల్ చౌదరి చెప్పారు.

## రామకృష్ణ ద్విపాత్రాభినయం

ఇప్పుడిప్పుడే ఫైల్‌లోకి వస్తున్న హీరోగా రామకృష్ణను పేర్కొనవచ్చు. ఇటీవల విడుదలయిన 'రైతుకుటుంబం'లో పోలీసు ఇన్‌స్పెక్టరుగా నిండుగా కనిపించి, మెండుగా నటించారు. త్వరలో విడుదల అయ్యే 'దత్తపుత్రుడు'లో రామకృష్ణ ఆడంబర జీవితానికి అలవాటు పడ్డ నవ యువకుడిగా బాగా చేసారు అని తెలుస్తూంది. మన కథానాయకులందరూ ద్విపాత్రాభినయం చేసారు. ఇప్పుడు రామకృష్ణకు అలాంటి అవకాశం, సంజయ్ చిత్రాస్‌వారి తొలి చిత్రంలో లభించింది.

## నాయికగా విజయనిర్మల

రకరకాల క్రయిం, సస్పెన్స్ చిత్రాలను చూస్తున్న మనకు ఏదో కొత్త తరహా కథనంలో, ఆసక్తిని అనురక్తి కలిగించే సంఘటనల అల్లికతో యీ చిత్రం వుండ గలదట. ఈ చిత్రానికి కథ, మాటలు, దర్శకత్వం ఎం. ఎస్. గోపీనాథ్ నిర్వహిస్తున్నారు. నాయికగా విజయనిర్మల నటిస్తూంది.

పై చిత్రానికి సత్యం సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయను, ఎ. ఎస్. మూర్తి కూర్పును నిర్వహిస్తున్నారు. ముఖ్య పాత్రలను నాగయ్య, ప్రభాకరరెడ్డి, జ్యోతిలక్ష్మి, విజయశ్రీ, శకుంతల, సలీమా, అర్జా జనార్దనరావు, ఆనందమోహన్, భీమరాజు, త్యాగరాజు పోషిస్తున్నారు. డి. జయంతరావు నిర్మిస్తున్న యీ చిత్రాన్ని ఆంధ్రాలో లక్ష్మీనారాయణ పిక్చర్స్, నైజాంలో పద్మ పిక్చర్స్ విడుదల చేస్తారు.

## బిశ్వజిత్ చిత్రంలో రేఖ !

జయంతమూవీ ఆర్ట్స్ బ్యానరు క్రింద నటుడు బిశ్వజిత్ సమర్పిస్తున్న 'కహా తేహైస్ ముజ్‌కో రాజా' చిత్రంలో నాయికగా రేఖ (పుష్పవల్లి కూతురు) నటిస్తూంది. నాయకుడు బిశ్వజిత్. ఈ

## ఇది మీకు తెలుసా

బొంబాయి, కలకత్తా, మదరాసు నగరాలనుంచి 62 మంది నటీనటులు, 29—2—1972 నాటికి, రు. 10,000 నుంచి 12 లక్షల దాకా ఇన్‌కమ్‌టాక్స్ బాకీలు ఉన్నారని లోక్‌సభలో 'ఆదాయం, వ్యయం శాఖ' మంత్రి శ్రీ కె. ఆర్ గణేశ్ చెప్పారని మీకు తెలుసా?

ఒక లక్షరూపాయలపైన బాకీ ఉన్నవారిలో ప్రముఖులు—

| | |
|---|---|
| శ్రీ ఎమ్. జి. రామచంద్రన్ | రు. 12,01,037 |
| శ్రీ కిశోర్‌కుమార్‌గంగూలీ | రు. 7,81,440 |
| శ్రీ దిలీప్‌కుమార్ | రు. 7,09,000 |
| శ్రీ రాజ్ కపూర్ | రు. 5,66,023 |
| శ్రీ దారాసింగ్ | రు. 2,33,002 |
| శ్రీ వి. నాగయ్య | రు. 1,91,379 |
| శ్రీ పృథ్వీరాజ్ కపూర్ | రు. 1,61,293 |
| శ్రీమతి బి. సరోజాదేవి | రు. 1,27,053 |
| శ్రీమతి రాజశ్రీ | రు. 1,08,929 |

ఈ సందర్భంలో సభ్యులు శ్రీ ఎస్. బెనర్జీ ఒక ప్రశ్న అడిగారుట మీకు తెలుసా? అదేమిటంటే— కొందరు నటులు తమతోటి వారిమీద అసూయతో చిలిపి పితూరీలు పంపుతున్నారా? అన్న ప్రశ్న.

ఈ ప్రశ్నకి సమాధానం రాలేదుట, మీకు తెలుసా? (ఒ. వి.)

చిత్రానికి ప్రయాగ్‌రాజ్ కథకుడు; ఆర్. డి. బర్మన్ సంగీతసారధి; మన్మోహన్ దేశాయ్ దర్శకుడు.

## మనోజ్ చిత్రంలో షర్మిలా!

విశాల్ ఇంటర్నేషనల్ ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న 'రోటీ కప్రా అవుర్ మకాన్' హిందీ చిత్రంలో మనోజ్‌తో షర్మిలా నాయికగా నటించడానికి అంగీకరించింది. కథ, నిర్మాణం, దర్శకత్వం బాధ్యతలను మనోజ్ కుమార్ నిర్వహిస్తారు.

## ఉల్ఫత్‌లో వహీదా

పూజా మూవీస్ నిర్మిస్తున్న 'ఉల్ఫత్' చిత్రం 10రీళ్ళు తయారైంది. ఎ. వి. ఎం. స్టుడియోలో శరవేగంతో తయారయ్యే చిత్రంలో రాజ్ కుమార్, వహీదా రెహ్మాన్, బేబీ గౌరి ముఖ్య పాత్రధారులు. సాధన మరొక నాయికగా నటిస్తున్న ఈ చిత్రానికి కె. శంకర్ దర్శకుడు.

## దో కినారేకి కొత్త దర్శకుడు

పూనా ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో డిప్లొమా అందుకున్న కబీర్ రాథోర్, ఫిలిం ఆశ్రమ్ నిర్మించే 'దో కినారే' చిత్రాన్ని డైరెక్ట్ చేస్తారు. ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమయ్యే ఈ చిత్రాన్ని కిషన్‌కిశోర్ — రాజేంద్రసిన్హా కలిసి తయారు చేస్తున్నారు.



రవిరాజ్ ప్రొడక్షన్స్ మొదటి చిత్రంలో వాణిశ్రీ.

## దస్తాన్ విడుదల

బి. ఆర్. ఫిలిమ్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'దస్తాన్' హిందీ చిత్ర రంగంలో సంచలనం కలిగిస్తుందట. క్యారెక్టరు నటుడు ఐ. ఎస్. జోహార్ వ్రాసిన కథ యిది. దిలీప్‌కుమార్ — షర్మిలా కలిసి నటించిన మొదటి చిత్రం యిది. ఈ చిత్రానికి లక్ష్మీకాంత్—ప్యారేలాల్ సంగీతాన్ని బి. ఆర్. చోప్రా దర్శకత్వాన్ని నిర్వహించారు.

## దేవర్ చిత్రంలో రాఖీ

'షర్మిలీ' ఫేం రాఖీని తమిళ నిర్మాత చిన్నప్పదేవర్ తన రెండవ హిందీచిత్రంలో నాయికగా బుక్ చేసారు. 'మనిషి—మృగం' అని చిత్రానికి నామకరణం జరిగింది. దేవర్ నిర్మించిన 'హాథీ—మేరే—సాథీ' విజయఢంకా మ్రోగించింది.

—శ్రీనివాస్

# అవీ-ఇవీ...

## అధ్యక్షులా! మొగల్ సామ్రాట్టులా!

1—4—1972 తేదీ 'బ్లిట్స్' పత్రికలో 'కోవాడిస్' అనే పేరుతో ఒకరు రాష్ట్రపతి శ్రీగిరి గారికి ఒక మనవి చేసుకున్నారు.

'గరీబీహటావ్' అని అరిచే నాయకులే మొగల్ సామ్రాట్టులలాగజీవిస్తున్నారని అరోపిస్తూ, రచయిత రాష్ట్రపతి ఈ విషయంలో మార్గదర్శకులు కావా లన్నారు. అయితే, అది జరగటంలేదు కదా రాష్ట్రపతి ఎంతో భోగైశ్వర్యాలలో మునిగితేలుతున్నారని ఆయన అన్నారు.

ఆయన ఉదహరించిన కొన్ని విశేషాలు—

* రాష్ట్రపతి భవనం ఆవరణ 133 హెక్టార్ల విస్తీరం కలది. దానిని నడపటానికి ఏటా కోటి రూపాయలు ఖర్చు అవుతాయి, అక్కడ 27 ఫవుంటెన్‌లు ఉన్నాయి!

* రాష్ట్రపతి జీతం నెలకి రు. 10,000. ఇదికాక, ఆయనకి ఏటా రు. 15లక్షల భత్యం వస్తోంది.

* రాష్ట్రపతి భవనంలో ఇచ్చే ఉద్యానవనం విందు లకీ, ఇతర విలాసాలకీ ఏటా రు 35 లక్షలు అవుతా యట.

* రా. భ.లో 2000 మంది పరివారకులు ఉన్నారుట.

* కొంతకాలం క్రితం రాష్ట్రపతి కోసం 6 తలుపులకల అతివైభవంతమయిన మెర్సిడీస్ కారు ఒకటి కొన్నారుట.

ఈ భోగభాగ్యాలతో నిండిన జీవితమేనా 1969 రాష్ట్రపతి ఎన్నికల లక్ష్యం, అని అడుగుతున్నారు 'కోవాడీస్' బ్లిట్స్ పత్రికలో! ఓ. వి.

* * *

'రాష్ట్రపతి సుహృద్భావం పెంపొందించే విదేశీ యాత్రలు చెయ్యటాన్ని మేము వ్యతిరేకించము. అయితే ఇంత శ్రద్ధతో థాయిలాండ్‌ని ఎన్నుకోటం అనవసరం. ఈ సమయంలో శ్రీగిరి థాయిలాండ్‌నే ఎందుకు ఎన్నుకోవలసి వచ్చింది?'

'రాష్ట్రపతి గిరి 'మన ఇద్దరిమధ్యా ఉన్న ప్రాచీన సంబంధ బాంధవ్యాల'ని గురించి మాట్లాడ వచ్చు, భారతదేశం, థాయిలాండ్‌ల మధ్య ఉండిన ప్రాచీన సాంస్కృతిక సంబంధ బాంధవ్యాలని ఉద్దేశించి అని ఉండవచ్చు ఆయన ఈ మాట. అన్ని ఆగ్నేయ ఆసియా దేశాలతోనూ భారతదేశానికి ఇటువంటి సంబంధ బాంధవ్యాలు ఉండేవి. కాని, నేటి భారతదేశానికీ, నేటి థాయిలాండ్‌కీ మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలు ఏమిటి? ఈ దేశంలో మనం తటస్థ విధానాన్ని, శాంతి పథాన్ని అనుసరిస్తున్నాము. థాయిలాండ్ ఏమో సామ్రాజ్యవాదులయిన అమెరికా సంయుక్త రాష్ట్రాలకి సైనిక స్థావరంగా ఉంటోంది. ఆ దేశం 'సీటో' (ఆగ్నేయ ఆసియా సైనిక ఒప్పందం) సభ్యత్వం కలది. ఇండోచైనాలో థాయిలాండ్ పెంటాగన్ తోచేరి నేరాలకి పూనుకుంది...

'వియత్నామ్, లావోస్, కాంబోడియాల మీద దాడులకి స్థావరంగా ఉన్న థాయిలాండ్(నాయకులతో) (శ్రీ) గిరి 'వియత్నామ్ మీద బాంబులు వెయ్యటం హెచ్చు చెయ్యటం శాంతియుత లావాదేవీలకి మార్గం కాదు.' అని అడిగారా?

'అలా అడగకపోతే ఆయన పెద్ద తప్పు చేసినవా రవుతారు.'

'న్యూఏజ్' (కమ్యూనిస్టు పార్టీవారి) వార పత్రిక: 2—4—1972. (ఓ. వి.)

## కళాసాగర్ ప్రారంభోత్సవం

మదరాసులోని ఔత్సాహికులైన తెలుగువారు కొందరు కలసి స్థాపించుకున్న 'కళాసాగర్' సంస్థకి స్థానిక నయానీ థియేటర్‌లో ఏప్రిల్ 9వ తేదీన శ్రీ అక్కినేనినాగేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. శ్రీ మాధవపెద్దిసత్యం ప్రార్థనాగీతంతో సమావేశం ప్రారంభం అయింది. సంస్థ గౌరవ అధ్యక్షులు డా. ముద్దుకృష్ణా రెడ్డి సభికులకి స్వాగతం చెప్తూ, ఆనాటి అతిథులైన 'దసరాబుల్లోడు' బృందాన్ని వేదికపైకి ఆహ్వానించి పుష్పమాలాలంకృతుల్ని చేశారు. సంస్థ కార్యకలాపాలని గురించి గౌరవ కార్యదర్శి శ్రీ ఎం. ఏ. సుభాన్ వివరించారు. ఉపాధ్యక్షుడు శ్రీ జి. ఎన్. భూషణ్ వందనసమర్పణచేశారు. అనంతరం 'దసరాబుల్లోడు' చిత్రాన్ని ప్రదర్శించారు. (ఓ. వి.)

* * *

ఏప్రిల్ 2వ తేదీ సాయంత్రం విజయవాడ మ్యూజియం రోడ్డులోని 'బుద్ధనివాస్' భవనంపై ఆశాశిఖరాలు నవలను ఆవిష్కరిస్తూ ఈ నవల చక్కని శైలిలో సాగినదని ఆవిష్కర్త శ్రీ నిడమర్తి ఉమా రాజేశ్వరరావు వివరించారు.

ఈ సభకు శ్రీ గెద్దాడ మల్లికార్జునరావు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా డాక్టరు జె. వీరస్వామి నాయుడు విచ్చేశారు. (ఓ. వి.)



ఇటీవల కలకత్తాలోని బిర్లా ఎకాడమీ మందిరంలో భరతనాట్య ప్రదర్శనం చేసిన కుమారి సోదరీమణులు. వీరిని సభికులకి పరిచయం చేసినవారు బ్రూక్‌బాండ్ కంపెనీ డిప్యూటీ చెయిర్‌మన్ శ్రీ పి. ఆర్. నీలకంఠన్.

# ఈ ట్రాన్సిస్టర్ రేడియో



# సంగీత విద్వాంసులు,గానకోవిదులు సహితం సంతోషంగా, సగర్వంగా దగ్గరవుంచుకునే ట్రాన్సిస్టర్ రేడియో

ట్రాన్సిస్టర్ రేడియోలు విశిష్టమైన శబ్దాన్ని ఇవ్వలేవు అనే ప్రతీతిని కాదని రుజువుచేసే ట్రాన్సిస్టర్ రేడియో, 4-బ్యాండ్సు నెల్కో కశ్రీ పోటీలేని ప్రదర్శనకు ఇదే రుజువు.

మామూలు ట్రాన్సిస్టర్స్‌తో వినడమంటే సంగీత విద్వాంసులెవరికైనా ప్రాణాలు తీసినట్టే. ఎందుకంటే సున్నిత స్వరాలు మామూలు ట్రాన్సిస్టర్స్‌లో బయటకు రావడానికి తన్నుకు చస్తాయి, నిజరూపాన్ని కోల్పోతాయి.

కాని కశ్రీతో అలాకాదు. చిట్టిబాబు, బాల మురళీకృష్ణ, రవిశంకర్ ఎవరి కచేరీ అయినా కానివ్వండి. కశ్రీలో వింటూంటే మీరు స్వయంగా కచేరీలో కూర్చున్న అనుభూతే కలుగుతుంది. ఎందుకంటే కశ్రీలో మంద్ర స్వరాలు పరిపూర్ణంగాను, మధ్యమ స్థాయి స్వరాలు స్వచ్ఛంగాను, తారస్థాయి స్వరాలు స్పష్టంగాను వినబడతాయి.

ఈ ట్రాన్సిస్టర్ రేడియో వింటూంటే సంగీత కచేరీకి వెళ్ళినట్లే.



రూ. 405/-
స్థానిక పన్నులు అదనం

**4 బ్యాండ్ల నెల్కో కశ్రీ**

టాటావారి ఉత్పత్తి

Creative Unit-141

ది నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కం. లిమిటెడ్.
బొంబాయి • కలకత్తా • ఢిల్లీ • మద్రాసు

# పుస్తకాలు

## మనోవిహంగం ఇతర కథలు

రచన— కాళూరి హనుమంతరావు 78 పుటలు. వెల రూ—2—00 ప్రతులకు కె. వి. శేషు బాబు, ఓయూబీ—యఫ్—7 యూనివర్సిటీ కేంపస్, హైదరాబాద్—7.

ఇందులో మనో విహంగంతో కలిసి పది కథలు ఉన్నాయి. ఈ కథలన్నీ యిదివరకు భారతి, స్వతంత్ర మొదలైన పత్రికల్లో ప్రచురింప బడినవే.

మానవ జీవితంలో జరిగే సంఘటనలు వ్యక్తుల ఆలోచనల్లో వచ్చే మార్పులు యీ కథలో చిత్రించ బడ్డాయి. ఇటువంటి కథలను వ్రాసి పాఠకులను మెప్పించడం కష్టం.

అబ్బాయి, అమ్మాయి కథల్లో ఉండే శృంగార రసం, సంఘంలో జరిగే అన్యాయాలను చిత్రించే కథల్లో ఉండే కరుణ రసం, హాస్య కథల్లో ఉండే హాస్య రసం ముందుగానే పాఠకుని మనస్సును ఆకట్టుకొంటాయి. కాబట్టి ఆ కథాకథనంలో కొంచెం లోపం ఉన్నప్పటికీ, పాఠకుడు అంతగా దాన్ని పట్టించుకోవడు.

ఆ సదుపాయం మిగిలిన రకాల కథలకు ఉండదు. అందుచేత యిటువంటి కథల ద్వారా పాఠకులను మెప్పించడానికి రచయిత పూర్తిగా తన కథాకథన సామర్థ్యం పైనే ఆధార పడవలసి ఉంటుంది. ఈ రచయిత ఆ ప్రయత్నంలో చాలా వరకు కృతకృత్యులైనట్లు చెప్పవచ్చును.

మనో విహంగం కథలో ఒక పూరిపాకలో సోడా కొట్టు పెట్టుకొన్న అప్పారావు అనే వ్యక్తిని ఒక స్కూళ్ల యిన్స్పెక్టరు చూస్తాడు. ఆ అప్పారావు యిదివరకు మిలటరీ కంట్రాక్టుల ద్వారా కొంత లక్షల రూపాయల ఆస్తి సంపాదించి, తరువాత దుర్వ్యసనాలకు లోనై ఆ ఆస్తినిపాడు చేసి ఎట్లాగ యిన్స్పెక్టరుకు అతని ఒంట్రోతు చెబుతాడు. జీవితంలో యింతటి ఒడు దుడుకులు వచ్చినా, అప్పారావు ముఖంలో విషాద రేఖ కన్పించనందుకు ఆ యిన్స్పెక్టరు ఆశ్చర్య పోతాడు.

మిగిలిన కథల్లో వ్యక్తుల ఆలోచనల్లో వచ్చే మార్పులు చిత్రించ బడ్డాయి. మొత్తం మీద యీ కథల్లో వైవిధ్యం తక్కువ. అందుచేత అప్పుడప్పుడు ఒక్కొక్క కథ చొప్పున చదివితే యీ కథలు బాగుంటాయి కాని ఒకేసారి వరుసగా యీ కథలు చదవడం ప్రారంభించినట్లయితే మధ్యలో పాఠకునికి విసుగు కలిగే ప్రమాదం ఉంది.

అబ్బాయి— అమ్మాయి కథలు చదివి విసిగి పోయిన పాఠకులకు యీ కథల్లో కొత్తదనం కన్పిస్తుంది. —మహేష్

## ప్రభాకరామాత్య కవి గ్రంథాలు

### (1) గద్వాల ప్రభాకరము—

డెమ్మీ 23+159 పుటలు వెల — సాదా ప్రతి 3. రూ. గ్రంథాలయ ప్రతి 4 రూ.

### (2) ఖండకావ్యములు — ఉపన్యాసములు—చాటువులు

డెమ్మీ 21+126 పుటలు వెల సాదా ప్రతి రు. 2—50, గ్రంథాలయ ప్రతి రు 3—50.

ప్రతులకు:— శ్రీ ఎ. వి. ఎస్. సుబ్బారావు, 1—8—155/5 మెండలేలేన్, ప్రెండరు గార్సు రోడ్డు, సికింద్రాబాదు—3.

(1) గత శతాబ్ది చివరలోను, ఈ శతాబ్ది ప్రారంభంలోను ఉండిన కవులలో శ్రీ ఆదిపూడి ప్రభాకరామాత్యులొకరు. వీరు గద్వాల సంస్థానంలో శ్రీ రామభూపాలుర కాలంలోనూ, వారి కుమారులు శ్రీ సీతారామ భూపాలుర కాలంలోనూ కూడా ఆస్థాన కవిగా ఉండి అనేకమంది విద్వత్కవులకు ప్రభువులచేత సన్మానం చేయించేవారు. ఎన్నో గ్రంథాలు రచించారు. ఆయా సందర్భాలలో ఎన్నో పద్యాలు చెప్పేవారు. వారి గ్రంథాలలో కొన్ని అసమగ్రాలుగా లభించాయి. ఉపలబ్ధమైనంతవరకు గద్వాల సంస్థానంలో ఉన్న సమయానికి సంబంధించిన రచనలను 'గద్వాల ప్రభాకరం' అనే పేరుతో కవిగారి కుమారులు శ్రీ సుబ్బారావుగారు ప్రకటించారు. అసమగ్రంగా ఉన్న కందరామాయణం, స్వర్గలేఖ, సమగ్రంగా ఉన్న గద్వాల ప్రభాకరం, పౌండరీకం అనే చిన్న కావ్యాలూ, ఇతరములైన ప్రాస్తావిక పద్యాలూ, వర్ణనలూ ఇందులో ఉన్నవి. రచన రసవంతమై తిరుపతి వెంకట కవుల ప్రశంసలను కూడా అందుకొన్నది. గ్రంథాదిని కవి జీవిత సంగ్రహం, డాక్టరు వెంకటావధానిగారి 'ప్రవేశకం' కవి యొక్కయు కవితయొక్కయు వైశిష్ట్యాన్ని తెలియజేస్తూ ఉన్నవి.

* * *

(2) ప్రభాకరామాత్య కవిగారి రచనలన్నిటినీ— లభించినంతవరకూ వారి కుమారులు సుబ్బారావుగారు నాలుగు సంపుటాలలో ప్రకటింప బూనుకున్నారు. అందులో ఈ సంపుటం ఒకటి. ఇందులో ఖండకావ్యాలు, ఉపన్యాసాలూ, చాటువులు 17 విషయాలుగా విభజించబడినవి. ఇందలి వ్యాసాలన్నీ పద్యరూపంగానే ఉన్నవి. చివర ఉన్న 'గృహలక్ష్మి' అనే వ్యాసం మాత్రం గద్యంగా ఉన్నది. 'శ్రీ హరి' అనే మకుటంగల వృత్త శతకం 'జగదీశా!' అనే మకుటంతోడి కందపద్య శతకం ఖండకావ్యాలలో చేరి ఉన్నవి. ఉపన్యాసాల్లో భాషకూ మతానికీ, రాజకీయాలకూ సంబంధించినవి ఉన్నవి. చాటువులు వివిధ విషయాలకు సంబంధించినవి. రచన ధారావాహికం, శైలి సులభం ఇందులో కూడా కవి జీవిత సంగ్రహం డాక్టరు దివాకర్ల వారి ప్రవేశిక ఉన్నవి. అందరూ చదువదగిన గ్రంథాలీ రెండున్నూ.

—అంగీరస

## 'టాడీ టాపింగ్ ఇండస్ట్రీ ఇన్ కేరళ: ప్రాజెక్టు రిపోర్టు'

తయారు చేసినవారు శ్రీ టి. జే. మాత్యూ.

కొబ్బరిచెట్టునుంచి ఉత్పత్తి అయ్యే కల్లు నీరాలను ప్రోత్సహిస్తే త్వరలో 'కోకాకోలా' 'ఫంటా' మొదలగు పానీయాలవంటె సరిదిగా అమ్ముడు పోతయ్యని రచయిత చెబుతున్నారు. ఈ పరిశ్రమ కేరళ రాష్ట్రానికేగాక దేశం మొత్తానికి మేలు చేకూరుస్తుందని రచయిత విశ్వాసం. అందుకే జాతీయ పానీయంగా 'కాడీ'ని గుర్తించాలంటున్నారు. (వేర్వేరు దేశాలకు వేర్వేరు జాతీయ పానీయాలున్నవని చెబుతూ గోవాకు 'ఫెన్నీ' అని చెప్పి అట్లాగే మన దేశానికి కూడా • అన్నారు. (పేజి 4) విప్లవాత్మకం [illegible].

ఈ పరిశ్రమను భారీయెత్తున ప్రోత్సహించటానికి ముందుగా అనేక కోణాల్లోంచి యీ పరిశ్రమను గురించి పరిశోధనలు జరగాలి. ఈ పరిశ్రమను ప్రోత్సహించటానికి ముందు దానికయ్యే ఆపర్చూనిటీ కాస్ట్'ను, అంచనా వెయ్యటం యెంతైనా అవసరం.

అలెప్పీజిల్లాలోని ఒక యెగుమతి వ్యాపారస్తుడు 'కాడీ'ని మూడు నాలుగు సంవత్సరాల వరకూ నిలవజేసే పద్ధతిని కనిపెట్టాడనే వార్త మార్చి (1972) మొదటివారంలో వెలువడింది. దీనివల్ల విదేశీ మార్కెట్టు కూడా లభిస్తుంది. శ్రీ మాత్యూ ఆశించినరీతిలో పరిశోధనలు జరుగుతున్నాయి అన్నందుకిది నిదర్శనం.

—శేశ్వపల్లి ●




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor: S. Sambhu Prasad.

